ప్రతులు ౧౦౦౦

సర్వస్వామ్యసంకలితము

PRINTED AT

*ORIENT PRESS, TENALI*

*1949*

గ్రంథ ప్రాప్తిస్థానము :

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,

44 జీరా

సికింద్రాబాద్ (దక్కన్)




*Presented In Memory Of*
*Late Vungapalli Neelakantam.*

# ప్రస్తావన

వివేకానందస్వామి యన్న నాకుఁ బరమగౌరవము. వారి దివ్యప్రతికృతి
నేఁబది యేండ్లనాఁడు ఏసుముహూర్తమునఁ జూచితినో, శాంభవీముద్రాముద్రి
తములైన తన్నేత్రకమలముల దృష్టిచేత నతిమాత్ర మాకృష్టుఁడనైతిని. నాఁటఁ
గోలె, శ్రీవారి దిగ్విజయాది వృత్తాంతములు వినుటయు, తదుపజ్ఞములైన
యుపన్యాసాదికములు చదువుటయు నియమముగా నాకుఁ దటస్థించుచుండె
డివి. వారిగ్రంథములలో నేను తొట్టదొల్తఁ జదివినది 'రాజయోగము'. 'త్రయ
మేకత్ర సంయమః' ఇత్యాదిపాతంజల యోగసూత్రములకు వారు వ్రాసిన వివర
ణము పఠించుటవలనను, ఆగ్రంథమునకు ఉపోద్ఘాతముగా వారు నెలకొల్పిన
యెన్మిదధ్యాయములలోని విషయము పరిశీలించుటవల్లను, యోగశాస్త్రము
యొక్క ప్రామాణికత్వమును, తదభిఖ్యాతవిభూతులయొక్క యాథార్థ్యమును
నా డెందమున కసందిగ్ధముగఁ బొడకట్టెను. ఆవల నన్నాకర్షించినవి వారి
'జ్ఞానయోగ' భాషితములు. వీని నే నెన్నిమారులు చదివితినో చెప్పఁజాలను.
నా చదువుకు మూలమున ఆసంపుటములు రెండుమార్లు శిథిలములై పోఁగా
నేఁడు మూఁడవది తాదృశావస్థాపన్నమై యున్నది. వానిలోఁ గొన్ని భాగ
ములు నేఁడును నాకు ముఖస్థములు. కాని గ్రంథమును స్మృతివిధేయము
గావించుకొనుట వేఱు. అందలి యాశయముల ననుభవమునకుఁ దెచ్చుకొనుట
వేఱు. శ్రీవారిమాటల కెంత పాటవము కలదో కాని, నేఁడు చదువుచున్నను,
వానికి నిర్నిరోధముగ హృదయమునఁ జొచ్చుకొనిపోవు వాఁడిమి కలదు.
సాక్షాత్కారవంతుల వాక్కుల కట్టి ప్రభావ ముండును గాఁబోలు.

**2.** ప్రాచీనభారతమునకు శ్రీశంకరభగవత్పాదు లెట్టివారో, నవీనప్రపంచ
చమునకు వివేకానందు లట్టివారనుట నిక్కువము. శంకరుని యద్వైతడిండిమా
రవములు భారతదేశైకశ్రుతములు కాఁగా, శ్రీస్వామివారివి అరణ్యానుల
నతిక్రమించి, కొండలను చీల్చుకొని, సముద్రముల దాఁటి, సర్వదేశములఁ
బ్రతిధ్వనించినవి. వీ రిర్వురు ప్రతిపాదించు తత్త్వము ఒక్కటే యైనను - విని
యోగవిషయమున భేదము కానవచ్చుచున్నది. సాధనచతుష్టయసంపన్నుఁ
డగు పరివ్రాట్టునకుఁగాని బ్రహ్మతత్త్వము చెప్పఁగూడ దనుట శంకరుల
మతము. బాహ్యమతనిరపేక్షముగ జిజ్ఞాసువుల కెల్లరకు జెప్పవలయుననుట
వివేకానందుని మతము. (318) దీనాతిదీనులై దాసానుదాసులై విదేశ

ప్రభువులకు కేలొగ్గి యున్న యస్మద్దేశీయజనసహస్రములఁజూచి, వీరియందడఁగి యభివ్యక్తముగాకున్న యాత్మస్వరూపమును జ్ఞప్తిసేసిన, వీరు ఆత్మగౌరవము నధిగమించి, ఆధ్యాత్మికబలమువడసి, మానవులలో మానవులై, సాధువులలో సాధువులై, వీరులలోవీరులై తలయెత్తికొని తిరుగఁగలరని వివేకానందుని నిశ్చయము. పాశ్చాత్యుల స్వాతంత్ర్య ప్రియత్వమును, భారతీయుల (పారతంత్ర్యేఽపి) ధన్యత్వమును జూచిన శ్రీవారి కిట్లుతోఁచుట వింతకాదు. సత్యమొక్కటియే యయ్యు దేశకాలనిమిత్తములఁజేసి, బోధించువిధులు భేదిల్లుచుండుననుటయే యిందలి రహస్యము. శంకరులుముక్తులయ్యు, జగన్మిథ్యాత్వదర్శనము కలవారయ్యు చేసినపని యంతయు, వ్రాసినగ్రంథములన్నియు జగముకొఱకే. అట్లే వివేకానందుఁడును, శంకరుఁడు, తనరచనలచే జనులకపునర్భవమునకు దారిఁజూపఁగా వివేకానందులు భవ మెత్తినమానవులు భౌతికముగా, నైతికముగా నార్థికముగా నభివర్ధిల్లుటకుగూడ వలయునుపదేశములను గావించియున్నారు. గృహస్థులకుఁగాదు సన్న్యాసులకే ఇట్టిది సాధ్య మనియు, కర్తవ్యమనియు స్వామివారితలంపు. (711)

3. శ్రీవారి గ్రంథములఁ బెక్కేండ్లుగాఁ జదువుచుండినవాఁడ నయ్యు, వారి చరిత్రము మాత్రము, మొన్న మొన్నటిదాఁక సాకల్యముగా నెఱుంగకుంటిని. శ్రీవారి చరిత్రములు చిన్న చిన్న వెన్నో యున్నవి. కాని పెద్ద వానిలోఁ బేర్కొనఁదగినవి 1933సం॥ మన్మిత్రులు శ్రీబులుసు వేంకటేశ్వరులు బి.ఏ. గారు వ్రాసిన దొకటియు, 1939 సం॥ మాననీయులు శ్రీ చిరంతనానందస్వామి రామకృష్ణమఠముగారు రచించిన దొకటియు ఈ రెండును చక్కని వచనగ్రంథములు. స్వామివారి చరిత్రము పద్యాత్మకముగా నున్న నెంతో హృద్యముగా నుండునని నే ననుకొనుచుండువాఁడను. కాని చరిత్రము దృష్టి వేఱు. కవిత్వము దృష్టి వేఱు. చారిత్రమునకు సత్యము ప్రధానము. కవిత్వమునకు రసము ప్రధానము. ఒకవంక రసము చెడకుండ, ఒకవంక సత్యముడివోకుండ వ్రాయుట అసిధారావ్రతము. అందువల్లనే గీర్వాణభాషలో నున్న శంకరాదుల చరిత్రములు అత్యుక్తిభూయిష్ఠములై, చారిత్రకదృష్టికలవారి కసంగతములై, విశ్వాసము కొలుపుటకుమాఱు వివేకులను విచికిత్సాపాళ్చేసి, ఉద్దిష్టప్రయోజనమునకు దవిష్ఠులను, జేయుచున్నవి. ఇందుకు నేఁడు విద్యారణ్యుని పేరఁ బరఁగుచున్న శంకరవిజయకావ్యమే ప్రబల దృష్టాంతము.

4. శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిలవారు ఈ చూపుల రెంటి జోడించి తమ 'వివేకానందము' అతి నిపుణముగ నిర్వహించి రనుట యందు యేమాత్ర మతిశయోక్తి లేదు. నిర్దిష్టాంశమును పఠితృజనచిత్త భిత్తికల చిత్రించుటకు శాస్త్రులవారు ఉపమ, ఉత్ప్రేక్ష మొదలగు నలంకృతుల నాశ్రయించినను, ఇతివృత్తకథనమున రేఖామాత్రమైన సత్యమున కడసి నడచినవారు కారు. అసలు శ్రీవారి చరిత్రమే యద్భుతముల కాకరమైనది. శైశవము దొరకొని నిర్యాణమువఱకుఁ గల తద్వినోదంతములన్నియు అతిలోకమహత్త్వ సంపన్నములు. వాని నెల్ల శాస్త్రిలవారు రమణీయముగను, రసోచితముగను, దిద్దితీర్చి మనకుఁ బ్రత్యక్షము గావించియున్నారు. అన్నియు నొక్కయెత్తు, అగస్త్యుఁ డొకయెత్తు అన్నట్లు శృంగారమును (అందును రసాభాసమును) పాకము చెడకుండ వర్ణించుట సుకరమైన పనికాదు. అది ముదిరెనేని, అశ్లీల మగును. లేకున్న రసపరిణతికే రాకయుండును. జగద్గురుని 'స్త్రీపరాఙ్ముఖత' నభివర్ణించుచు, శాస్త్రిలవారు రచించిన సందర్భములు మూఁడును మిగుల నాగరికములుగా నున్నవి. ఆ కామినుల ప్రలోభనములును వారికి శ్రీ స్వామివారి ప్రత్యుత్తరములును అంత సుకుమారముగ వాక్రుచ్చుట శాస్త్రిలవారికే సాధ్యమైనది. అందుఁ గొంత వేర్పఱచి యిట నుద్ధరించుటకన్న వానిం జదువుకొను కార్యము పాఠకులకే వదలివేయుచున్నాను. అవకాశముకొలఁది శాస్త్రిలవారు ఇతరరసములనుగూడ చక్కఁగా పరిపోషించియున్నారు. ఉదాహరణమునకు 588 పద్యమున హాస్యరస మెట్లు వెల్లివిరియుచున్నదో చూడుఁడు. ఇట్లే యితరఘట్టములును — అతి హృద్యములుగా నున్నవి. ఉండకేమి? శాస్త్రిలవారి పాండితి సర్వతోముఖము. ఎక్కడనేని యొక సాహసము కానవచ్చిన అది "తేజీయసాం న దోషాయ" యనుటకు లక్ష్యము. పాణినీయ వ్యాకరణమునం దెంతెంత పరిశ్రమము సేయకున్న 'తత్సమచంద్రిక' వంటి గ్రంథము వ్రాయుటకు సాధ్యమగును? తెనుంగు బాసమాత్ర మభ్యసించి గీర్వాణాగమప్రౌఢోక్తి ఫలముల గ్రాసమేయు కవి వామనులకు అది నిశ్రేణికవంటిది కాదా? అట్లే కావ్యాలంకార సంగ్రహమునకు (నరసభూపాలీయము). వీరు వ్రాసినవివృతియు నలంకారశాస్త్రమున వీరు గావించిన యుదాత్తకృషికి ఎత్తిన పతాకగా నున్నది. ఇట్లెవ్వరునురచింప సాహసింపని వ్యాకరణ, అలంకార శాస్త్రముల నాంధ్రభాషలో రచించి భాషోద్ధరణమును గావించుటయే కాక ఆంధ్రభాషకుఁ గొంగ్రొత్తలగు జాతక

కథాగుచ్ఛము మొదలయిన యుత్తమకావ్యములను రచించియు సత్కవిగాఁ గీర్తితులయిరి. ఎన్నియున్నను ప్రస్థానముల కృతశ్రములు కాని వారు, శ్రీ వివేకానందస్వామి హృదయమున నూకముగ నవగతము చేసికొన నేరరు. ఆ విషయమునను వీరపశ్చిములుగానే యున్నారు. పరమతపోగరిష్ఠులగు బ్రహ్మశ్రీ మేడవరపు సుబ్రహ్మణ్యశాస్త్రిలవారు వీరి కద్వైత తత్త్వోపదేష్టలని యెఱుంగుటకు నే నెంతయు సంతుష్టుఁడ నగుచున్నాను.

ఇన్ని తెఱంగుల యోగ్యతగల శాస్త్రిలవారికి వివేకానందస్వామి జీవితము పద్య ప్రబంధముగా నిబంధింపఁ దలంపు కలుగుట పాఠకుల భాగ్యవిశేషము. దానిం గృతిగొన్న మా నెయ్యురు, బంధుసింధుచంద్రాయమాణులు మహోదయులు చి॥ పులిగుండ్ల వేంకటకృష్ణయ్యగారి ధన్యత్వము నేమని కొనియాడవలయును ? వివేకానందుని యాశీర్వాదము క్షేత్రీపురప్రభువునకుం బోలె ఈ కృతిపరిగ్రహము ఆ జాయాపతులకు-సత్సంతానప్రదము, సర్వాభీష్టదాయకమునగుగావుతమని సర్వశక్తిసమన్వితుఁడగు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను. వస్తుగౌరవము వక్తృగౌరవము — రెండునుం గల ఈ గ్రంథము ఆంధ్రదేశమున బహుళప్రచారముం బొరసి విద్వాంసులయు, విద్యార్థులయుఁ గరముల నలంకరించి పెద్దల స్వస్వరూపావబోధనమునకును పిన్నల లోకకల్యాణహేతుకార్యనిర్వాహమునకును తరలించు. గావుత మని యాశంసించుచున్నాను.

నెల్లూరు
9—7—1949

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

# వి జ్ఞ ప్తి

నా యీ గ్రంథ రచనకుఁ బూజ్య శ్రీ చిరంతనానంద స్వాములవారి వివేకానంద జీవిత చరిత్రమే యొజ్జ బంతి. కాని రెండు విషయములు శ్రీ స్వాములవారు సూక్ష్మముగా సూచించిన వానిని (౧) తన్నుఁ జేపట్టినచో ధనికురాలగు నొక వనిత యాతని దారిద్ర్యమును రూపుమాపుదు నని పలుక నరేంద్రుఁ డా ప్రస్తావనమును ధృణీకరించెను; (౨) ఇట్లే మరియొక యువతి యాతని వ్యామోహితునిఁ జేయుట కై యత్నింప నాతఁ డిట్లు తన విశుద్ధ హృదయమును వెల్లడించెను. (చూ. దారిద్ర్యము. దైవ ప్రార్థన పుట 52) కల్పించి విస్తరించితిని. ఇవి చరిత్రాంశములు గాకున్నను వివేకానందుని విశుద్ధబ్రహ్మచర్య వ్యంజకములు. ఈ కల్పనము కావ్యశిల్ప దృష్టితో విమర్శించినచో దూష్యము గాదని నా నమ్మకము.

ఈ కావ్యమున న, ణ ల ప్రాసము, రేఫ శకటరేఫ ప్రాసము, సబిందు నిర్బిందుక ప్రాసము, నన్నయ ప్రయుక్తమైన 'లేకను,' "లుక్సంశ్లేషౌనాచిద్రుతస్య" అని సూత్రించియుఁ దత్ప్రయుక్తమైన 'అన్నిష్టసఖ' వంటి అచ్చోటి సంశ్లేషమును, నిట్లే కొన్నింటిని బూర్వుల ననుసరించియుఁ గొన్నింటిని స్వతంత్రించియుఁ బ్రయోగించితిని. మరియు రేఫ శకటరేఫ నియమములు, అర్థానుస్వార నియమములును మత భేదములు పెక్కులుండుటవలన విశేషించి పాటింపలేదు. రెండు తావులందు యతిభంగము గలిగినది. వానిని సాధు పత్త్రమున సంస్కరించుకొంటిని. సామాన్యముగా నేను రస

మును గుఱించివలె యతిప్రాసలను గుఱించి శ్రద్ధవహింపను. అవి యాదృచ్ఛికముగానే పడును. ఒకచోఁ బడకుంటయుఁ గలదు. అవి పడనిచో దోషి నైతి నని భావింపను. ఏలన నివన్నియు రసదోషములు గావు. నిజముగా 'రసాపకర్షకా దోషాః' అనుచోఁ బ్రతి దోషమును రసాపకర్షము గాక రసాపకర్షకమైనది మాత్రమే దోషముగాఁ బరిగణింపఁబడునని యర్థము

నా యీ కావ్యకన్యకమూల్యమైన 'ప్రస్తావనా' రూప మగుఁ కల్యాణతిలకమును దిద్ది దీవించిన నా పూజ్య మిత్రులు అభినవ తిక్కన శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

మరియు నా గ్రంథమును గూర్చి విన్నంతమాత్రముననే దీని నంకితము నొందఁ గోరి తమ కోరికిని నానుఁ దెలిపి నా గ్రంథమునకు నుదాత్తతను జేకూర్చిన శ్రీ శ్రీ పులుగుండ్ల వేంకటకృష్ణయ్య, బి. ఏ., బి. యల్. గారికి భగవంతుఁడు దీర్ఘాయురారోగ్యములను, ధన కనక వస్తు వాహన సమృద్ధియుఁ, బుత్త్రపౌత్త్రాభివృద్ధియుఁ బ్రసాదించుఁ గాత మని ప్రార్థించుచున్నాను.

గ్రంథకర్త.



కృతికర్త　　　　　　　　　　　　　　కృతిభర్త

# కృతిపతి వంశావళి

కం. "శ్రీ కృష్ణంభొట్లు" సమా
ఖ్యాకుఁడు పులుగుండ్లకులుఁడు ద్వారావతి ము
న్నా కృష్ణుని చందంబునఁ
బ్రాకట 'వెలుపూఁడి' పురినిఁ బావనపఱచెన్. ౧

కం. వెల లేని శ్రోత్రియకమున
వెల లేని తపఃప్రభావ, వృత్తోజ్జ్వల కీ
ర్తుల, నతఁ డానల్లిండ్లగు
వెలుపూఁడినిఁ జేసినైచె వెలిపూఁడినిఁగాన్. ౨

కం. అతనిగృహంబున సతతము
శ్రుతిఘోష ప్రతిధ్వనించు; సూరిస్తుత్యుం
డతఁ డా కర్మబ్రహ్మ
ప్రతిపాదికి జైమినికి సరాసరి వచ్చున్. ౩

ఉ. ఆ పులుగుండ్ల వంశ కల
శాంబుధియందు శశాంకుఁడట్లు శ్రీ
'పాపయ' ధీవరుండు ప్రభ
వంబు వహించి కళా ప్రపూర్ణుఁడై

లోపములేక యెందు, నతి
లోక పవిత్ర చరిత్రుఁడై ప్రతి
ష్ఠాపనముం బొనర్చెను ది
శాపలయంబునఁ గీర్తిచంద్రికల్. ౪

కం. శ్రీలుండగు నాతని యి
ల్లాలు సతీరత్నమగు 'మహాలక్ష్మి' గుణా
వాలము; తనపతి దిద్దెను
వాలాయము మాధవునిఁగఁ బాపయనామున్. ౫

కం. పిలిపించి పెట్టుచుండును
గలకాలము భిక్షువులకుఁ గడుపారఁగ; గు
డ్డలు గుడుసులిచ్చు; నొసఁగును
వలసిన; వా యమ్మ దీనబాంధవి తలఁపన్. ౬

కం. ఆపుణ్యదంపతుల కొగి
శ్రీపతిపాదాబ్జచంచరీకమనస్కుల్
ఔపనిషదపథవర్తను
లాపుత్రులు 'చెంచురామయ'యు 'సుబ్బయ'యున్. ౭

కం. 'శ్రీరామయ్య'యుఁ గలిగిరి
ధీరులు; త్రేతాగ్నులో? శ్రుతిత్రయమో? యం
చూరూరఁ జెప్పికొందురు
వారిని నాబాల వృద్ధ పౌరజనంబుల్. ౮

గీ. 'చెంచుసుబ్బయ్య', 'పాపయ్య', ప్రాంచితమతి
యైన 'వేంకటకృష్ణయ్య' యార్యచరితు
లైన 'సుందరరామ', 'రంగయలు' 'శార
దాంబ' యును చెంచురామయ్య లౌరసతతి. ౯

సీ. శ్రోత్రియాగ్రణి బుధస్తుత్యుండు 'చెంచు సు
బ్బయ్య' పెండ్లాడె 'లక్ష్మమ్మదేవి'
నల 'రెవెన్యూ'శాఖ యం 'దినస్పెక్టరై'
'పాపయ్య' మనియె 'సుబ్బమ్మ'తోడ
ఆర్య 'సుందరరామయ' 'సబుమేజస్ట్రీటు'
'శ్రీరామసుబ్బమ్మ' చెట్టవట్టె
రైల్వేమహోద్యోగి 'రంగయ్య'బుధుఁడు 'స
రస్వతీ'దేవితో రాణనొందె

గీ. భ్రాతృపంచకమున రహిఁ దారకాళి సు
ధాంశుఁడట్లు కృష్ణయార్యుఁ, డతని
యువతి యన్నపూర్ణయును రోహిణివిధానఁ
బరగుచుంద్రు కనులపండువుగను. ౧౦

కం. పరువుఁ, బ్రతిష్ఠయు, శీలము
వరకీర్తియు, దానధర్మపరతయు నీయె
ల్లరికినిఁ బిత్ర్యంబగు సిరి ;
సరాసరిగఁ బంచుకొనిరి శ్లాఘ్యులు భ్రాతల్. ౧౧

గీ. వీరి సోదరి శ్రీమతి శారదాంబ
గృహిణిగాఁ గొని పెద్ద యదృష్టమొందె
ననఘ దుర్భాన్వయుండు 'పిచ్చయ్యశర్మ'
వడసి 'కట్టమ్సు' శాఖలో ప్రముఖపదవి. ౧౨

కం. ధీమహితుఁడు 'కృష్ణయ' మ
ధ్యేమణివలె భ్రాతృతతిని దీపించుచు శ్ర
ద్ధా మేధాదిక సుగుణ
స్తోమము రూపొందినట్లు శోభిలుచుండెన్. ౧౩

కం. 'పులుగుండ్ల చెంచురామయ'
లలామ భూతుండు పెద్దలకు, విప్రులకుం
దలబంతి; తపోమహితుఁడు
వెలింగె శ్రీరాముఁడన్న విఖ్యాతిమెయిన్. ౧౪

కం. అడుగనివారిది పాపము
పుడుకుల మ్రాఁకనఁగ నతఁడు ముప్పొద్దులు బి
ట్టెడుచుండు; వానిచేతికి
నుడువుదురు నరంబు లేదనుచు నెల్లరునున్. ౧౫

గీ. అతని యర్ధాంగలక్ష్మి 'కామాక్షి' పేర;
శీల సంపద కామెను సీత యంద్రు
పుణ్యులగు వారి శుభనామమును స్మరింపఁ
గలుష కాండంబు పంచబంగాళమగును. ౧౬

కం. చరియించుచుంద్రు మున్నా
టరువదినా ళ్ళెన్నో వ్రతాదులు; గావిం
తురు దంపతిపూజలు ; భూ
సురసంతర్పణ లొనర్తు శోభితభక్తిన్. ౧౭

కం. విని దీనాక్రందనమును
గనికరమున మనసుగరఁగఁ 'గామాక్షమ' దాఁ
దినఁబోవు కబళమెత్తుక
కొనిపోయియు వారికొసఁగి కొను సంప్రీతిన్. ౧౮

ఆ. వె. దివ్యమూర్తులయిన దేవకీ వసుదేవు
లకును గృష్ణుఁడట్టులను జనించె
విబుధవినుతగుణుఁడు వేంకటకృష్ణయ్య
ధన్యులైనయట్టి దంపతులకు. ౧౯

ఆ. వె. అత్యుదారులయిన యా దంపతు లపత్య
హీనులకు స్వపుత్త్రదాన మొసఁగి
మొగిఁ గాచినారు పున్నామనరకంబు
సందుఁ గూలకుండ నార్ద్రమతులు. ౨౦

కం. అల కృష్ణుఁడు నంద యశో
దల పటు తనపాలకులగు తలిదండ్రులఁ బు
ణ్యుల 'రంగమ' 'పిచ్చయ్య'ల
నెలయించెను గృష్ణమూర్త్యుఁ డెల్లరు మెచ్చన్. ౨౧

ఆ. వె. దత్తపుత్త్రుఁడయ్యు బత్తిమై 'వేంకట
కృష్ణుఁ' డౌరసుండె యాతఁడనఁగఁ
బెంచుకొన్నయట్టి పితరులు ముదమొందఁ
గన్నవారి నల్లె కాంచఁదొడఁగె. ౨౨

గీ. కర్ణుఁగాంచు నల రాధకరణిఁ, గృష్ణుఁ
గనుఁగొను యశోదసరణి, రంగమ్మ తనదు
పెంపుడుకొమారుఁడనుచు భావించ దెదను;
కృష్ణయార్యుని జననినం చెపుడుఁ దలఁచు. ౨౩

సీ. అహరహంబును బ్రాహ్ణామందు మెల్కని పోయి
పాదాభివందన వ్రతమొనర్చుఁ;
బరమభాగ్యంబకా భావించి యనుదినం
బోగి మైలపుట్టంబు లుదుకుచుండు;
సాయాహ్నములయందు శ్రద్ధమైదరిఁ జేరి
తమిఁ దదీయోపదేశములు వినును;
గనుదమ్ములకు నద్దుకొని రాతిరులఁ బాద
సంవాహనక్రియల్ సలుపుచుండు;
గీ. నడుగులకు నెల్లవేళల మడుఁగులొత్తు
చాదిదంపతులనుబోలె నవితరంబుఁ
గొలఁదిమీఱినబత్తిమై గొలుచుచుండుఁ
దల్లిదండ్రులఁ గృష్ణయ్య ధర్మవిధిని. ౨౪

కం. క్షితినిఁ వేంకటకృష్ణయ
పితృపైతామహకులంబు పెంపడరఁగ న
ద్భుతముగ మాతామహకుల
మతిలోకంబైనయట్టి యశమున వెలిఁగెఁ, -౧౫

సీ. వైదికాచారసంపత్తి లెస్సగఁగల్గి
నిత్యాగ్నిహోత్రియై నెఱి వెలింగ
వేళపాళలులేక విధివిరామములేక
తనయింట నన్నసత్త్రమును నడపె
స్వపరహస్తముల ద్రవ్యంబును గడియించి
యిచ్చియజ్ఞంబు సేయించెఁ బ్రీతి
లోకతంత్రమున నలోకసామాన్యంబు
ప్రజ్ఞ సంపాదించి ప్రౌఢిమెఱసె
గీ. అల చతుర్వేది సత్కుల కలశవార్ధి
సోముఁడైనట్టి 'సుందరరామ'యార్యుఁ
డల్ల వేంకటకృష్ణయ్య తల్లితండ్రి;
అతని కాతండె సముఁడందు రవని జనులు. -౧౬

కం. దేవబ్రాహ్మణగోగణ
సేవాపరతంత్రుఁ డతఁ; డశేషజనంబుల్
జేవెట్టుచుందు రాతని
కావించిన మేళ్ళు పెద్దగాఁ బేర్కొనుచుఁ. -౧౭

మ. క్షితి 'శ్రీరామయ'నాఁగ 'రాఘవయ'నా,
శ్రీ'రామచంద్రయ్య' నా
సుతు లా'సుందరరామ' యార్యునికి సం
శోభిల్లినా ర్ముగ్గు ; రా
యతపుణ్యుల్ సుతలైరి 'రంగమ'యుఁ 'గా
మాక్షమ్మ' 'సుబ్బమ్మ' శ్రీ
మతి 'రామమ్మ'యు వేంకటాదియగు ల
క్ష్మమ్మన్నవా రేవురున్. ౨౮

కం. శ్రీరామయ పుణ్యోజ్జ్వల
చారిత్రను 'వెంకమాం'బ సతిగాఁగొనియెన్
శ్రీరాముఁడు సీతనువలె;
వారలదాంపత్య మలరెఁ బ్రస్తుత్యంబై. ౨౯

కం. నూరాఱులిచ్చి బుధులకు
శ్రీరామయ గౌరవంబుసేయు; నతఁడు నె
ల్లూరి పురిం గట్టించె; ను
దారుఁడు సంస్కృత కళాసదనమందు గదిన్. ౩౦

సీ. వారి కుదయించె 'సత్యగోపాలుఁ'డనఁగఁ
గొడుకు; మన కృతిభర్తకుఁ గుడిబుజంబు;
మరియు "వేంకటలక్ష్మమ్మ" నిరుపమాన
వర్తన కొమార్తె; కృతిపతి ప్రథమభార్య. ౩౧

కం. నయధురీణుండు 'కాంగ్రెస్'
ప్రియుండు శ్రీరాఘవయ్య పెండ్లింటికిఁ జ
న్నయటుల్ చెఱసాలకుఁ జనె
వ్యయించె జీవితము లోకబాంధవునిగతిన్. 32

కం. ఘనుఁడై 'హిందూబాంధవి'
యను పత్రిక, నిరువదేఁడు లాదట నడిపిం
చెను రాఘవయ్య దా నిలి
పిన శ్రీమత్తిలకవిప్రవిద్యాలయమున్. 33

ఆ. వె. ఇతని పుత్త్రకుండు కృష్ణయ్య బాల్యంబు
నందె జ్ఞానవృద్ధుఁ డయ్యె నవుర!
అతఁడు దొంటిజన్మమందు యోగభ్రష్టుఁ
డయి, జనించె నిప్పు డనుచుఁ దోఁచు. 34

మ. జనసమ్మాన్యుఁడు 'పల్లిపా'డను నెడన్
స్థాపించి కృష్ణయ్య పె
ల్చన సేవాశ్రమమొండు; జాతికుల వై
షమ్యంబుఁ బోఁద్రోలి సే
వను గావించుచు, యోగసాధనల న
భ్యాసించుచున్, గర్మయో
గసరూపుండయి దివ్యజీవనముతో
గాలంబుఁబుచ్చెం దగన్. 35

కం. స్పృహణీయగుణుం డాతఁడు
మహాత్మగాంధిపదయుగము మరియుఁ గొలుచుచున్
సహవాసంబు 'సబర్మతి
మహాశ్రమ'మునందుఁ జేసి మాన్యతకెక్కెన్. ౩౬

కం. "అరవిందు' సేవ సేయుచు
నరవిందాశ్రమమునందు నతఁడున్నాఁడి
త్తఱిఁ; బుణ్యజీవులందుం
బరగుచు నున్నాఁ డతండు ప్రప్రథముండై. ౩౭

గీ. అతఁడు శ్రీ 'యరవిందు' జీవితము వ్రాసె;
రహించి "విజ్ఞానచంద్రికాగ్రంథమాల"
కంకురార్పణకరులయం దాతఁ డొకఁడు;
ఆంధ్రభారతి సేవకుం డయ్యె నిట్లు. ౩౮

గీ. భ్రాతలందుఁ దృతీయుండు రామచంద్రుఁ
డన్నలకుఁ దీసిపోని సమర్థుండు
ఏకవృక్షఫలంబులం దెచట నేని
నాకృతింగాక గుణభేద మరయఁగలదె? ౩౯

కం. కృతిపతి వేంకటకృష్ణయ
సుతునింగాఁ జూచుకొనుచు 'స్ఫోటక'పరిపీ
డితు నతనిఁగాంచి, తా మూ
ర్ఛితుఁడయ్యెను; వాని కెంతప్రేమయొ? తలఁపన్. ౪౦

కం. వ్యవహారంబుల దక్షుం
డవనీసురవరుల సభ కుపాధ్యక్షుండై
ప్రవచింపరాని సేవను
స్తవనీయుఁడు సేసె రామచంద్రయ్య దగన్. ౪౧

ఆ. వె. ప్రాచ్యవిద్యలం దపారాభిమానంబు
రామచంద్రయార్య ప్రకృతియగుట
సలిపె 'సింహపురి'ని సంస్కృతపాఠశా
లకు సహస్రరూప్య నికర మీవి. ౪౨

కం. దయ బీదలందు, కాంగ్రెస్
ప్రియత్వ, మతార్జవంబు త్రికరణములలో,
నయశాలిత్వముఁ గలిగి వి
జయియై పొలుపారె రామచంద్రయ్య కడున్. ౪౩

కం. శ్రీరుక్మిణీ వధూ ట్యవ
తారంబగు 'రుక్మిణి'ని నతఁడు పెండిలియై
శౌరియనఁ జెలఁగి కాంచెను
మారుండనదగ్గ యొక కుమారకమణినిన్. ౪౪

గీ. కడుపునంబెట్టుకొని, తన్నుఁ గాఁచి, పెంచి
పెద్దగావించి చదువుఁజెప్పించి యింత
యింటివాని నొనర్చిన యీడ్యు లిట్టి
మాతులులభక్తిఁ గృష్ణయ్య ప్రాతిఁగొలుచు. ౪౫

మ. మన శ్రీవేంకట కృష్ణయార్యునికి స
మ్మాన్యంపుఁజారిత్ర్య, మా
అనివాదాన్యక, మాత్మబాంధవసుహృ
ద్రాశి ప్రియంభావుక
త్వ నయం, బుత్కటకావ్యగానరసలు
బ్ధత్వంబు, సారళ్య, ము
గ్ధునఁద్రావించెనో తల్లి బాల్యమునఁ; జే
కూరెన్ సమృద్ధంబుగన్. ౪౬

మ. ధనసంపాదకు లెందఱోకలరు; ల
బ్ధద్రవ్య మీకృష్ణయా
ర్యుని చందంబున దీనమానవుల శ్రే
యోవృద్ధికైయిచ్చువా
ర్గనరా రొక్కరు; నానువంశికముగాఁ
బ్రాపించెనో దాన ధ
ర్మనిరూఢత్వము, సాధుశీలమును, సా
మంజస్య మవ్యాన్నికిన్. ౪౭

శా. నాకున్ మిత్రుఁడు నాకుమిత్రుఁడని వి
న్నాణంబుగా నెవ్వనిన్
వాకొం ద్రెల్ల; రజాతశత్రుఁడని సం
భావింత్రు వేసిం బ్రజల్;

లోకారాధనమన్న వేనిమదిఁ గ
ల్గుం బెద్దయుత్సాహ; మా
శ్రీకృష్ణయ్యకు న్యాయవాది మణికిన్
జేపెట్టుదుర్ నిచ్చలున్. ౪౮

చ. పెనఁగఁడు పేర్ప్రతిష్ఠలకు;
బీదలపాలిటి పెన్నిధానమై
యొనరుచు గుప్తదానముల;
నోపఁడు స్తోత్రములం బొనర్చుచో
వినయవిధేయవృత్తులకు
వేంకటకృష్ణయ యాటపట్టగున్;
దన పులుగుండ్ల వంశము న
తండు వెలుంగఁగఁజేసె దీపమై.

కం. ఈచేత గడించిన ధన
మాచే వెచ్చించుచుండు నర్థాకృతులకై;
దాఁచినది ప్రాఁచి దనుకొను;
యాచకకల్పకమనంగ నాతఁడె పుడమిన్. ౫౦

మ. పెనుఝంఝూహతి నావ దీర్ణమయి పో,
బిట్టార్చుచున్ వార్థిలో
మునుఁగంబోయెడు కన్య 'యాంధ్రసభ' స
మ్మోదింపఁగాఁ బ్రాణర

క్షణముంజేసి యొకింటిదానిఁగ నొగిం
గావించెఁ 'గృష్ణయ్య' యొ
య్యన ; కృష్ణయ్యకు నార్తరక్షణగుణం
బాచారధర్మంబ పో ! ౫౧

సీ. 'అభినవతిక్కన' యని పేర్గనిన పెద్ద
తనకు 'దుర్భాశర్మ' ధర్మదోగ్ధ
'సరసకవీంద్రుఁడఁ' బిరుదొందు 'మోచెర్ల
రామకృష్ణయ్య' స్వప్రాణసఖుఁడు
గుణోత్తరుఁడు 'సత్య గోపాలకృష్ణుండు'
గలకాలముం దన కార్యదర్శి
అల్ల కోటాన్వయుండగు శ్రీనివాసరా
వలరారు నిజబహిఃప్రాణమట్లు.
గీ. భారతీమహాదేవి పూజారులమగు
మాదృశులు చుట్ట పక్కముఁల్; మాన్యతముఁడు
బుధవిధేయుఁడైన పులుగుండ్ల వేంకట
కృష్ణయార్యునిదె యదృష్టమన్న. ౫౨

గీ. 'అన్నపూర్ణమ్మ' యతనియిల్లాలు సాధ్వి
'వేంకటేశ' 'సీతమ్మల' ప్రియతనూజ
నిట్టలము పుట్టినింటికి మెట్టినింటి
కసముఁ దెచ్చిన శ్లాఘ్యురాలామె నిజము. ౫౩

కం. పతి శుశ్రూషయు, నభ్యా
గతపూజయు, దైవభక్తి, కరుణార్ద్రమన
స్కతయును బెట్టని సొమ్ములు
మతిమతియగు 'నన్నపూర్ణ'మకు సత్యముగన్. ౫౪

కం. ఆయమ్మకు నాయయ్యకు
నీయిల నేయమ్మగాని యేయయ్యయుఁ గా
నీ యుండరు పోలంగా;
వేయేలా? సాటివత్తుర్వీరికి వీరే. ౫౫

కం. ప్రవరున కతనిపురంధ్రికి
నవతారము లనఁగవచ్చు నల 'వేంకట కృ
ష్ణ' విబుధవర్యుఁడు, నాతని
యువతీమణి 'యన్నపూర్ణ'యును దలపోయన్. ౫౬

కం. అంకిత మొనర్తు శ్రీమద్
'వేంకట కృష్ణయ'కు నా'వివేకానందం'
బంకించుత నీయుభయం
బింక మిథోఽలంకరిష్ణు వృత్తి నెసఁగుచున్. ౫౭

---

శ్రీ పరదేవతాయై.

# వివేకానందము

## అవతారిక

కం. అలకాయస్థ క్షత్రియ
కులంబునను దత్తనామ గోత్రమునందున్
నెలవలెఁ గడలిని, బాలుఁడు
గలిగెను దశదిశలఁగాయఁగా వెన్నెలలన్. ౧

మ. తొలి నీ భారతఖండమెల్ల నభియు
క్తుండై ప్రయాణించి వా
గ్బలులన్ భిన్నమతస్థులన్ గెలిచి య
ద్వైతంబు స్థాపించు ధీ
బలుఁ డుర్విం డిరె శంకరుండు భగవ
త్పాదుండు పాశ్చాత్య దే
శ్యులు నామంబుల శిక్ష సేయఁగ వివే
కానందనామంబునన్. ౨

కం. వీరేశ్వరాంశభవుఁడై
'వీరేశ్వరుఁడ'య్యె; ముద్దు పేరఁట 'బిలే';
ధారుణి 'నరేన్' 'నరేంద్రుఁడు'
నా రూఢి వహించెఁ జిన్ననాఁ డంకితుఁడై. 3

గీ. బ్రహ్మసాక్షాత్కృతిం బొంది రామకృష్ణ
పరమహంసానుకంప సుప్రతిభుఁ డతఁడు
స్వామియై వివేకానంద నామమొంది
యార్షసంస్కృతి నాఁటె ఖండాంతరముల. ౪

## ౧. బాల్యము

గీ. భవ్యభస్మానులేప మాపాదముఖము,
జడలమొత్తంబుఁ దల, దోలు నొడలియందుఁ
బూని తిరుగాడు బైరాగి కానఁబడినఁ
బరమశివుఁడంచును నరేంద్రుఁ డెరఁగుచుండు. ౫

గీ. తాత సన్న్యాసి ; జనకుండు ధర్మమూర్తి;
జనని సద్భక్తురాల్ ; భువి సంక్రమింప
కాస్తి పాస్తులు పోలిసిన నాత్మజునకుఁ
దఱచుగా నానుసంశిక ధర్మమంటు. ౬

కం. ఇఱువదియై దేండ్లకె తా
విరాగియై యూరినుండి వెలికుఱికిన య
ప్పరమగవంబగు 'దుర్గా
చరణుని' దనతాత గుఱించి సాదుల నడుగున్. ౭

మ. 'నిను యాచించి గ్రహించి తెమ్మనిరి నూ!
నీతాతగా'రంచు డా
య నరేంద్రుం డదినమ్మి బాల్యమున నా
యాకంఠికా, కర్ణికా

మణి ముద్రాంకటకాంబరంబులను స
మ్యగ్భక్తిమై నిచ్చుచుం
డును సన్న్యాసులకున్ సతంబుఁ దలి దం
డ్రుల్ చూడరా నట్లుగన్. ౮

కం. పరిపక్వయౌవనంబునఁ
బరిత్యజించెఁ దనతాత భార్యాసుతులన్;
నెఱదాత తండ్రి; త్యాగము
నరేంద్రు కులవృత్తియగుట న్యాయంబె కదా! ౯

గీ. ధ్యానమునఁ జేసి జడగట్టుఁ దల యటంచు
విని నరేంద్రుండు ధ్యానించి పెద్దతడవు
తడవికొని చూచుఁ; గ్రమ్మఱ ధ్యానమగ్నుఁ
డగును; వెండియుఁ గనుఁ; జేయు మగిడి యట్లు. ౧౦

కం. నడినెత్తి కెత్తి కురులను
ముడివైచి, యులంది భస్మమును మేనెల్లన్,
నడుమున ధరించి కావిని
బుడుతఁడగు నరేంద్రుఁ డద్దమునఁ జూచుకొనున్. ౧౧

గీ. జనని భువనేశ్వరీదేవి శైశవమున
రామకథ నుగ్గుఁబాలతో రంగరించి
పోసెనో! యేమొ! వినఁజెవిఁ గోసికొనును
వీణవలె నామె పాడు వేళలందు. ౧౨

సీ. ఎవరు రామాయణముఁ బఠియించుచున్నఁ
గేలుమోడిచి కూర్చుండి యాలకించు;
హనుమ త్యాగంబునకు, భక్తి కక్కజపడి
లక్ష్యముగఁ బెట్టుకొనియె బాల్యమున నతఁడు. ౧౩

మ. "హనుమంతుండు వసించు కే లరఁటి తోఁ
టం"దంచు నాలించి బా
లనరేంద్రుం డొకనాఁడు వేచి నిసిఁ జా
లాసేపు సంతప్తుఁడై
చనుదేరఁగ భువనేశ్వరమ్మ యిటు లా
శ్వాసించె; 'నాతండు రా
మునికార్యార్థము పోయియుండు; మరి రే
పో! మాపో! రావచ్చులే!' ౧౪

కం. తన తోడిబాలకులతోఁ
జనితోఁటకుఁ గ్రీడలాడి సాయాహ్నము కాఁగ
"మన మందఱ మిట ధ్యానం
బొనరింత"మ టంచుఁ గూరుచుండె నతఁ డటఁగ ౧౫

సీ. యోగసిద్ధుం డతండు గూర్చున్న తృటినె
నిర్వికల్పసమాధి మునింగి పోయెఁ;
గనులు మూయుచుఁ దెఱచుచుఁ గదలుకొనుచు
నట్టిటులు సూచుచుండె నయ్యార్భకతతి. ౧౬

బాల్యము

మ. సరిగా బాలకుమారవుం డొకమహా
సర్పంబు మందానిలాం
కురపంక్తిం బడగెత్తి మేయఁగని గ
గ్గోలొందుచున్ లేచి బా
లురు పర్వెత్తి యెలుంగు రాల్పడఁగఁ బి
ల్పుల్ పిల్చినం దన్ను, బి
గ్గరఁ జప్పట్లను గొట్టినం గదలఁడుం
గందోయినిన్ విప్పఁడున్. ౧౭

కం. పఱచి చొరంబడెఁ బుట్టను
సరీసృపము రివ్వుమంచు శాబకతతిప
ల్లఱపులకుఁ; బెద్దతడవుకు
నరేంద్రుఁ డీక్షించెఁ దెఱచి నయనయుగంబున్. ౧౮

గీ. అతఁడు హీరేశ్వరశివాంశ మందుఁ బుట్టె;
నాతఁడు సంద్రుఁడు; డింక భయం బదేల?
ఎఱుఁగుఁ బా మింటి హాస్యంబు; నెఱుఁగ లేక
పల్లెతాయులు కడిఁది భ్రమశిల్లుచుండ. ౧౯

గీ. ఉర్వి పరమేశ్వరాంశస్తు డుదయమొందె
నాఁడతఁడు నాస రేంద్రుండు నాట్యమందు
ధూర్వహత్వసహిష్ణుత్వ మందెకొనుచు;
సంగ్రమింపఁబడు నిర్వగరిమ నెఱుఁగ? ౨౦

## ౨ పాఠశాలా జీవితము

సీ. తారకావళిలోనఁ జంద్రముఁడు వోలెఁ
దరుగణంబునఁ జందనతరువు వోలె
ముత్తెసరమున నాయకముత్తె మట్లు
క్రాలె నాతండు దరగతిబాలురందు. ౧౧

కం. తనకడను రమ్మటంచును
దనకడఁ గూర్చుండు మనుచుఁ 'దనకడ' ననుచున్
అనుదినము దోఁడిబాలకు
లు నరేంద్రుం బిలుతు రతని లోకోత్తరతన్. ౧౨

ఆ. వె. ఆ నరేంద్రచంద్రుఁ డరుదెంచని దినం బ
మాస యంట; పూర్ణిమాదినంబ
వచ్చినట్టినాఁడు పాఠశాలాకలా
బ్ధులకు; వానినిండుఁ బలుకనేల? ౧౩

కం. తనదగు కరరేఖావళిఁ
గనంబఱచి తోడిబాలకశ్రేణికిఁ దె
ల్పును "నేను సన్న్యసించెద"
నని సాముద్రికుఁడు నొడివె నని హర్షమునన్. ౧౪

కం. ఒకకాల్ క్రీడాస్థలమున
నొకకాల్ బడియందు వాని; కొకనాఁడును బు
స్తకమంటు పాపమునఁబోఁ
డొకటవ వాఁడుగఁ బరీక్ష నుత్తీర్ణుఁడగున్. ౧౫

మ. తన బోధించెడి పాఠముల్ విన కెదో
ధాన్యంబునన్ మగ్నుఁడై
నసరేంద్రుంగని యొజ్జ కోపితమతిం
దండింపఁ బ్రశ్నింప, వెం
టనె తూచా లును దప్ప కాత్మగురు నో
టన్ వచ్చె నేవాక్యముల్
మును వ్రాసెన్ సరిఁబల్కె దేశికుఁడు లో
లో నక్కజం బందగన్. ౧౬

గీ. దిప్పకాయలలో రణదిప్పకాయ
ప్రాజ్ఞమండలమునయందుఁ బ్రాజ్ఞతముఁడు
అయి నరేంద్రుండు బాల్యంబునందు నా న
రేంద్రుఁడగు కృష్ణునింబోలి యిల వెలింగె. ౧౭

కం. మొదలం దరగతి పెద్దై,
పిదపం బడిపెద్దయగుచు, వెనుకఁ గ్రమముగాఁ
జనపెద్దలలోఁ బెద్దయి
యెదిగెను వామనుప భాతి నెల్లయుఁ దానై. ౧౮

మ. తమ జీతంబులు గట్టలేక, యొక పో
త్రంబేఁ గోసంబాల కం
గముసం దాలిచి చింకిపాఁతల స్వక
క్ష్యాబాలురం గూడి మూ

డీ మెలంగం గొందుకాడు పిల్లలకు హృ
ప్తింగూర్చు నాయూయి లో
పములం దీఱిచి చేసి నేస్తమును సౌ
భ్రాత్రంబుఁ బాటించుచున్. ౨౯

సీ. "జాతిమతభేదములు లేవు; జాతి యొకటె;
స్పృశ్యతాస్పృశ్యతలు లేవు; స్పృశ్యు లెల్ల"
రన్న యద్వైతసిద్ధాంత మా నరేంద్రుఁ
డింట వాదించుఁ బెద్దలు గంటగింప. ౩౦

కం. అనయము సీతారాములఁ
దనగదిఁగుడ్యమున వ్రేల్చి తత్పరమతి స
ర్చనలను ముప్పొద్దు లోన
ర్చును; భజనలుసేయు నతఁడు ప్రోజ్జ్వలభక్తిన్. ౩౧

మ. తలుపుల్ మూసి ప్రశాంతమానసమునన్
ధ్యానించు చాదివ్యమూ
ర్తుల మ్రోలం దగఁ గూరుచున్న తనికై
దుఃఖించుచుం దల్లిదం
డ్రులు గాలించిరి పట్న మెల్లఁ; దుదిఁగ
న్గోఁజాలిరింట్లోన్ గదిన్
దలుపుం గ్రుద్ది కడుంగడు న్నఱచి దీ
ర్ణద్వారులై యెట్టులో! ౩౨

ఆ.వె. "పాలుగారు ముద్దుబాలకుం డితఁ డేమి?
ఇట్టి ధ్యానసిద్ధి యేమి? తలఁప
భువి జనించెనో? తపోభ్రష్టుఁ డెవఁడేని"
యనుచు సంశయాళు లయిరి వారు. ౩౩

కం. అందంబునఁ జందంబున
నందక వాఙ్మనసముల కుదాహరణంబై
మందికి, నాతఁడు శైశవ
మందును సడిసన్న యశము నంది వెలింగెన్. ౩౪

కం. ఒకనాఁడు క్రీస్తుమత బో
ధకుఁ డొకచో నొక్కరుండు తత్రత్యుల క
జ్ఞ కులంబునకుం గఱపుచు
స్వకీయమతధర్మనిష్ఠ వైశిష్ట్యంబున్. ౩౫

కం. "శ్రీకృష్ణుఁడు దేవుండే?
పోకిరియై చెఱచెఁ బెక్కుపొలఁతుకల; నసం
ఖ్యాకము లొనర్చెఁ జౌర్యము;
లేకగణినిఁ బూజ్యుఁ డౌతఁ? డీరలె చెప్పుఁడీ! ౩౬

కం. పరులొనరించినఁ బాపము;
హరి యొనరింపంగఁ బుణ్యమగునే? దీనిం
బరికించి యేమొ? యని గ
క్కఱి 'మహాత్మాం నాస్తి పాతక' "మ్మని విఁగాఘుల్. ౩౭

సీ. నానుడిలఁ గద్దు "రామాయణమ్ము రంకు;
భారతము బొంకు; వేయేల భాగవతము
బండుబూ"తంచు నీ గ్రంథవార మెల్ల
మీరు ప్రామాణికముగ నమ్మెదరు గాదె? ౩౮

ఆ. వె. సుబ్బరాయి శంకరుఁడు ; పంగనామంబుఁ
బెట్ట దాని కగును విష్ణుమూర్తి ;
ఆంజనేయుఁ డయ్యె నంటింపఁగాఁ దోఁక ;
దొండమిడ వినాయకుండు నయ్యె. ౩౯

కం. కృతదురిత ఫలంబులు క్షితి
శతజన్మము లనుభవింత్రు జనులని హిందూ
మతమును : మా క్రీస్తుప్రభు
వు తగన్ క్షమియించి యిచ్చుఁ బోఁ మోక్షంబున్. ౪౦

కం. అనుచున్ హైందవదేవత
లను వారి పురాణగాథలను దెగడుచు ని
ట్లనె "నేమిసేయు విగ్రహ
ము నాదు దండమున లెస్స పూజింపంగన్."? ౪౧

మ. అనుచుం బామరలోకపండితుఁడు క్రై
స్తాచార్యుఁ డాడంగఁ ద
జ్జనముల్ నమ్మక నమ్ముచున్ నగుచుఁ ద
త్సంబద్ధ హాస్యోక్తులన్

వినుచుండంగ నరేంద్రుఁ డాఁగి యెటకో
విచ్చేయు చాలించి జ
ల్పన లాపాదశిరంబుగాఁ బ్రబల కో
పజ్వాలలం గ్రాఁగుచున్ ౨౨

కం. "మీ దేవుఁడైన క్రీస్తును
నా దండముచేతఁ బూజనముసేయు" మటం.
చాదేశించును మాకన
మీఁదికిఁ గ్రిందికినిఁ జూచి మెరమెరఁబోడన్ ౨౩

కం. "మరణానంతర మీదృశు
నరకంబునఁ గట్టిత్రోయు నా దేవుఁ" డనన్
దౌర ; "జంపకోఁతవట్టును
బరపరమని యముఁడు నిన్నుఁబట్టి" యని మరిన్ ౨౪

గీ. ఆర్షమైన సనాతనంబైన ధర్మ
తత్త్వమెఱుఁగంగఁ బ్రకృతిశాస్త్రములు దగవు ;
దల్లక్రిందులుగాఁ గృచ్ఛ్రతపము సేసి
వానిఁ బశ్చిమబుద్ధుల కెఱుఁగరాదు." ౨౫

గీ. అనిన యుక్తిశోభయు నరేంద్రుఁ గని యులుకుచు
సభ్యులందఱు చప్పట్లు చఱచి నగిరి
మొగము వెలవెలఁబాఱ నా బోధకుండు
నిలువఁజాలక చనె నెత్తి దులుపుకొనుచు. ౨౬

## 3. కళాశాలా జీవితము

గీ. శైశవముతోడ నా పాఠశాల వదలి
జవ్వనముతో మహాకళాశాలఁ జొచ్చె
వ్యాసవక్తృత్వ చర్చాసభల నతండె
యుండెవేసిన చేయియై యలరె నందు. ౧౭

శా. వ్యాయామం బొనరించి మల్లురకుఁ మా
ర్తాండుం డనం బెక్కు ప
ర్యాయంబుల్ గొనె మల్లయుద్ధముల శ్లా
ఘ్యం బైన కాస్కల్; కుశా
గ్రీయప్రజ్ఞయుఁ గాత్రపుష్టియును నే
కీభూతమై కూరుచున్
శ్రేయోరాశి; నదే నరేంద్రునికిఁ దె
చ్చెం బో! నరేంద్రత్వమున్. ౧౮

సీ. బాహాస్ఫాలించెనా! ప్రతిమల్లుఁడు వరించు
సూర్యాక్షఘుభ్రాంతి సప్తజనుసు దేల్చు
గానంబుఁ బాడెనా! గండుఁగోయిల పికంకఁ
'గో' యని బాలకుల్ కూయుచుంద్రు
పాకంబొనర్చెనా! పాచకాగ్రేసరుల్
నల భీమసేనుల నాల్కఁగా నలు
వాదించెనా! తర్కవాక్యముల్ కాణాద
గౌతములేసి మూకత నపహంత్రు

సీ. మూఢవిశ్వాసములకు దంభోళి యతఁడు
భయతమస్సాండమునకు భాస్వంతుఁ డతఁడు
సత్యసాహసములకుఁ గేసరి యతండు
గల్గఁడె? యట్టిండు గండరగండఁ డౌతఁడు ? ౪౯

కం. చదువుల సరస్వతి, యపర
మదనుఁడు, దేశాభిమాని, మహనీయగుణా
స్పదుఁడు, బలదర్పసింహము,
వెదకినఁ గనరాదు వెలితి పీస మతనిలోన్. ౫౦

సీ. ఆకళాశాలప్రాచార్యుఁ డానరేంద్రు
సర్వతోముఖవిజ్ఞాన చణతఁ గాంచి
తన్నుఁ దనతోడి విబుధబృందమ్ముఁ దలఁచు
దివిటీకడ వెల్గులంబోలు దీపములుగ. ౫౧

సీ. యూనవనారంభమందు సూనాయుధుండు
పొంచి యువకుల డెందముల్ చించువాఁడు
ఆనరేంద్రుని హృదయంబుఁ బూని యోనిఁ
దాఁక లేఁడయ్యె నుగ్రావతార మనియొ ? ౫౨

ఆ.వె. విరులపొదల చెప్పఁ బరికింప సహచరుల్
వాసిదృష్టి మరము వైపు మరలె;
ధనచమూర్జనమునఁ దమకింప వాని శ్రీ
పోధనార్థ మతఁడు పోవనుంచె. ౫౩

గీ. తాల్చి యాంగ్లేయవేషమ్ముఁ దారుచుంటి
వా,రతఁడు గోరెఁ గాషాయవస్త్రములను
“ఊరియుండఁజే దొకత్రోవ ; యులిపికట్టె
దొక్కత్రోవ” యని వా రెక్కసక్కె మాడ. ౫౨

కం. “ నలసారము సంసారమ
ఖిలదుఃఖావహము ; భయనికేతన ; మస్థిరం
చలము ; పరాధీనం ; బిం
దుల జీవనమేల నమ్ముదురు తత్త్వజ్ఞుల్. ”

గీ. “ మౌనినాథ ! కుటుంబజంబాలపటల
మగ్న మాదృశగృహమేధి మండలంబు
నుద్ధరింపంగ నౌషధ మొండు గలదె ?
యుష్మదంఘ్రిరజోలేశ మొండుదక్క. ”

గీ. అని గృహస్థాశ్రమమ్ము దూషణ మొనర్చు
నయ్యయి పురాణసూక్తుల నాలకించి
“ అకట ! ఆబ్రహ్మమశక ముత్స్నకము లోక
మీ గృహస్థతకై ” యంచు నేవగించు. ౫౫

సీ. దర్పకాంతకుఁడయ్యు దారుకావనపురం
ధ్రుల వెంటనంటె శర్వుండు చెలఁగఁ
దనుఁదాఁకు పాపసంతతి నిల్వనం గాల్చి
ననలుండు మునికాంతలను గ్రహించె

మొగి మూఁడుకాళ్ళుల ముసలిపయ్యును సుర
జ్యేష్ఠుండు దనకూఁతు చెట్టవట్టె
శతమఖుండయ్యును గ్రతుభుగీశ్వరుఁడయ్యు
శక్రుండు రంభాది సతులఁ గూడె.

గీ. ఒకరిఁగా ; దిద్వరినిఁగాద ; వికవిక నగ
నలుగురుఁ బదాఱువేవురు చెలులఁ గలఁచె
గృష్ణుఁ డవతారపురుషుఁడై యిస్సి ! యనుచు
నా ననేంద్రుఁ డుపహ్యాంచె నాత్మ వారి. ౨౮

ఉ. కన్నెడు గోరు రూపముఁ, ద
గం జనయిత్రి వరించు భాగ్య సం
పన్నత; తండ్రి యిష్టపడు
మాన్యచరిత్రము, బంధులెన్ను వి
ద్యోన్నతియుం, గులీనతయు
నొప్పు నరేంద్రుని కిచ్చఁగన్న సం
పన్నలు " మేము నే " మనుచు
వచ్చిరి యాతని తండ్రిముద్దకున్. ౨౯

మ. " పదివేలూఱులు గట్నమిత్తు" మనుచున్
"స్వర్గాభిషేకంబు న
ల్పుద" మంచుం " బరదేశవిద్యలకు ను
ద్వేలంబుగా సుల్క - ము

"చ్చెద" మం చొండొరులం గడుం గడచుచున్
శ్రీమంతులా గేస్తులా
డుదు రాబాలుని తండ్రిశ్రో సుతల
నీటుల్ గోటులుం జెల్లుచున్. ౫౦

కం. జననీజనకులు తగు యువ
తిని బెండ్లి సేయఁగా మదిం దలఁచిరి; త
త్తనయుండు ముక్తియువతిని
మనంబున వరించియున్న మాటెఱుఁగ రయో ! ౫౧

మ. తలిదండ్రుల్ స్వపరాఙ్ముఖత్వము వినం
దద్దన్ వగం గూలి పోఁ
గలరంచున్ వచియింప కవ్విధిఁ "గళా
కారార్థ్య మార్జించి య
వ్వలఁ బాణౌకరణంబుఁ జేసికొనఁగా
వాంఛింతు ; నీపై నిఁకన్
బలవంతం బొనరింపఁబోకుఁ డనుచుం
బ్రార్థించు "బీలే" కడున్. ౫౨

౪ గవేషణ

కం. "భగవత్సాక్షాత్కారమె
యగుఁ బరలక్ష్యం; బిఁకం గృహస్థాశ్రమ మం
దు గజేంద్రుఁడు మకరమునకుఁ
బగిదిని జీవుండు చిక్కువడ నేల యిసీ!" ౫౩

కం. పురుషార్థంబులఁ గడపటి
దరయన్ సన్న్యాససాధ్య; మత్తఱి గృహియై
తరువాత సన్న్యసించుట
బురదం దిగి కాలుకడుగు పోలికి గాదే? ౬౧

చ. తెలిసియు లెస్స లాఁతి కుప
దేశ మొనర్పఁగఁజాలి స్వీయబో
ధలఁ జరియింపఁజాలఁడు గ
దా! శకునంబులఁ జెప్పు బల్లియో
తెలియక చేటుపాటుఁ, గుడి
తింబడినట్టులు జీవి యక్కటా!
కలుషమహాబ్ధియందు మును
కల్ వయిచున్ సతమున్ గృహస్థుఁడై.

సీ. క్షితి స్వగమ్యస్థలంబు ప్రాగ్దిక్కుగాఁగఁ
బశ్చిమాశకుఁ బయనించు వాని పగిది
లక్ష్యమగు మోక్ష మొందఁజాలఁడు గృహస్థు;
ప్రాప్యమగు నది సన్న్యాసపథముచేన. ౬౪

కం. ఈ వెఱ్ఱిచదువు లేటికి?
జీవితలక్ష్యమగు మోక్షసిద్ధికైన నేఁ
గావింతు యత్నమును; గురు
దేవుని శోధించుకొని సుధీరత్నంబున్." ౬౫

కం. అని నిశ్చయించి బడికిం
జనకయు, నొకవేళఁ జన్న శ్రద్ధాళువుగా
వినకయు మతి మాలినగతిఁ
గనంబడుచునుండెఁ గొంతకాలము దాఁకన్. ౬౬

సీ. తలదాల్చి జడలమొత్తము గాత్రమున భస్మ
మెత్తి వర్తిల్లెడు నెట్టి బైరాగుల
నుఱవుగా మెయి ద్వాదశోర్ధ్వపుండ్రంబులఁ
దీర్చి దిద్దిన సద్వైష్ణవవ్రజంబు
మొగినిఁ గూర్మమయూరముఖ్యాసనములచే
హఠయోగనిష్ణాతులైన మునులఁ
దలక్రిందుగాఁ గృచ్ఛ్రతప మాచరించుచు
నణిమాదిసిద్ధిఁ గన్నట్టి యతుల
గీ. బట్టి దర్శించుకొని వారివారి నాత్మఁ
డాత్రపాటునఁ బ్రశ్నించు నవిరతంబు
"బ్రహ్మసాక్షాత్కృతిని మీరు పడసినారె?"
యనుచు విని తత్సమాధానమును మునుఁగు. ౬౭

ఆ.వె. భువి మహర్షియన్న పొగడికగన్న దే
వేంద్రనాథుఁగాంచి యిట్లులడిగె
"స్వామి! తమకుఁ గానవచ్చెనే? భగవంతుఁ"
డనుడు మాఱుపలుకఁడయ్యె నతఁడు. ౬౮

మ. కనుఁ గ్రైస్తాలయముల్; మసీదుల నమా
జ్గావించుఁ; జొత్తెంచుఁ బ్రా
ర్థనకై బ్రహ్మసమాజ మందిరములన్
రాత్రిందినం బిట్లు తి
ర్గినఁ బెక్కేండ్లు నకేందు మానసము సం
తృప్తంబు గాదయ్యె దే
వుని సాక్షాత్కృతి నాఁడునాఁటికి నభః
పుష్పంబుగాఁ జేలుటన్. ౧౯

మ. భగవద్దర్శనముం బొనర్ప మదిఁ దీ
వ్రంబయ్యె సంకల్ప "మె
వ్వాగ దర్శింతును? జూచినార మనుచున్
వాక్రువ్వ రెవ్వారు; శా
స్త్రగణం బాతని దివ్యరూపము నవి
శ్రాంతంబుఁ గీర్తించుచుం
డు; గురుం డెవ్వఁడు దివ్యదృష్టి నిడి "క
న్గొ"మ్మంచుఁ జూపించునో"? ౨౦

కం. చనుఁ బనులు, రేయి, వారము
లును, బక్షంబులు, నెలనెలలును, నిటులే రేం
డ్లను బూరాడ్లు; జీమ సేయును
ఘనగంగాయాత్ర; నేను గణచన నెన్నెన్. ౨౧

ఆ.వె. చక్రవాళరేఖ చందాన వెనువెనుక
కరుగుచుండు సతతముఁ దరియుకొలఁదిఁ
బట్టియిచ్చునట్టి పరమకృపాళుండు
దొరకు నాకెవండు ధరణియందు ?" ౭౨

కం. అనుచున్ క్షణక్షణంబును
మనమున దర్శనముకొఱకు మ్రగ్గుచు నన్నం
బును పానీయంబును గై
కొనకయును దదేకచింతఁ గుములుచు నున్నన్. ౭౩

గీ. తనదు బాంధవుఁడగు "రామదత్తుఁ" డతని
చిత్తవృత్తిని గ్రహియించి చెప్పె నిటులు
ఏఁగుము ! నరేంద్ర ! యలదక్షిణేశ్వరమున
రామకృష్ణాఖ్యుఁ డొక మహాద్రష్ట గ్రాలు. ౭౪

కం. చదువకయ సంగ్రహించెను
జదువుల సారంబు నెల్ల; సాగరమును ని
ర్మథియింపక సుధఁగొన్నటు
లదనీయచరిత్ర మద్భుతావహము సుమీ ! ౭౫

కం. సమలోష్టకాంచనుం డా
యమి; పసిఁడిని బాఱవేయు నానల; సుంపాం
వుము ! తజ్జితేంద్రియత్వము
స్వమానినిని 'జనని !' యంచు సంబోధించున్. ౭౬

ఆ.వె. మఱుగుదొడ్డు లూడ్చి; మాలమాదిగల యు
చ్ఛిష్ట మెంచె యజ్ఞశేష మంచు
విప్రసంఘ్యుఁడయ్యు; భేదభావం బిట్లు
పొలియఁజేసి బ్రహ్మభూయ మొందె. ౨౭

మ. అల ‘శ్రీతోతాపురిపేరి’ దివ్యయతి శి
ష్యత్వంబునం జిత్తవృ
త్తి లయంబొందఁగ నిర్వికల్పకసమా
ధిం బొంది బ్రహ్మిష్ఠుఁడై
కలకాలంబును గాళికామహాత ప
త్కంజద్విరేఫంబునై
యలరారెం జుమి రామకృష్ణుఁడు పురా
ణ స్త్రీంద్రదేశీయుఁడై. ౨౮

కం. గురులకు గురులనఁదగు పె
క్కండ్రు తచ్ఛిష్యు లఁట; దేనిఁగూర్చి యెఱిఁగినన్
ఎఱుఁగంబడు సర్వం బా
పరతత్త్వము గోచరించె వాని కిఁకేలా? ౨౯

కం. పడుకొన్నఁ గూరుచున్నను
నడచుచునున్నను సతంబు నమ్ము! సమాధి
స్థుఁడుగా నెతోఁచు మనసులకుఁ;
బుహుపు నీనాఁడు తేర మీదృశ యోగుల్. ౩౦

ఆ.వె. అతనిఁ 'బరమహంస' యంద్రు; కుటీచకుం
డని, బహూదకుండు, హంస, పరమ
హంస, లనియుఁగలరు యతులుత్తరోత్తరో
త్తములటంచు విబుధతతి వచించు. ౧౧

కం. స్వయముగఁ దీర్ణుండగు వాఁ
డయి పరులఁ దరింపఁజేయు నర్హుం; డేలా
హాయిరాణి? యెండమావుల
కయి పర్వెత్తుచుఁ దటాక మదిగోఁ; గనుమా!" ౧౨

కం. వినినంతనె యప్పలుకులు
మనోవ్యథాభార మెల్ల మటుమాయంబ
య్యెను; దేలికయ్యెను నరేం
ద్రునికి; భవిష్యంపు నీడ దోఁచదె? దొలుతన్. ౧౩

కం. "మును రామకృష్ణుఁగూర్చి
వినియుంటినిఁగాని యింత వింతగ విననై
తిని; నతనిపేరు వినిననె
మనః ప్రసన్నత్వమొదవె మాయురె?" యనుచున్. ౧౪

గీ. ఆనరేంద్రుఁడు దద్దర్శనాభిలాష
నిలువెడలుచుండ ప్రోఁగె దేవళముగంటు;
ముంగిటను నిండుకుండతో ముత్తయిదువ
యెదురుగావచ్చెఁ; గాంచెనో యిద్ది లేదో? ౧౫

## ౫. రామకృష్ణ సందర్శనము

గీ. ఆశ్రమద్వారమందున్న యలరుఁజెట్టు
లర్ఘ్యపాద్యంబు లొసఁగె; విహంగవితతి
స్వాగతంబు సమర్పించె నానరేంద్రు
నకు ముదంబయ్యె నాపూజనంబుఁ గాంచ. ౧౬

మ. చని వీక్షించెను జీర్ణపర్ణకుటి వృ
క్షచ్ఛాయఁ గూర్చున్న వా
నిని, సంతతస్మితముఖుఁడయ్యు వేనిఁ గొలఁకో
నిష్టప్రచిత్తంబు లో
న నిరీక్షించుచునున్న వాఁడనుచుఁ ద
ట్టంజేయు వానిన్, మహ
ర్షిని, బూతాత్ముని రామకృష్ణుని, జగ
చ్ఛ్రేయోభిలాషిం దగన్. ౧౭

గీ. తప్పిపోయియుఁ గాననాంతరమునందుఁ
దన్ను వెదకుచు వచ్చు వత్సమును గాంచు
ధేను వన రామకృష్ణుండు శ్రీనరేంద్రుఁ
డను సమాగతుఁ గాంచి కొనె ముదంబు. ౧౮

గీ. ఆ నరేంద్రుని నొక్కొక్కయుడుగు దలఁచు
నెక్కు నొక్కొక్కకఱి రామకృష్ణు మోము
నవ్వు కళ లప్పుకొలఁది నవ్యాయతముగు
నా నరేంద్రుని హృత్తమం బనఁగఁదోఁచఁగ. ౧౯

సీ. తలఁజేసి సాష్టాంగ మెరఁగి తత్పాదపద్మ
ములను గన్నీయి కద్ద, సమ్మోదపడుచుఁ
బరమహంస స్పృశించి తచ్ఛిరము లేపి
బాష్పగద్గదకంఠుఁడై పలికె నిట్లు. ౯౦

సీ. "ఎంతకాలాన కిచ్చటి కేఁగుదెంచి?
తింత నైర్ఘృణ్య మేల వహించి తోయి!
నీదు సందర్శనమునకై నీవెఱుఁగవు
వాచియున్నవి నాకనుల్ వాస్తవముగ." ౯౧

కం, అని తనదు ప్రాంతచుట్టం
బనఁగా శ్రీరామకృష్ణుఁ డాడుచు వానిం
గొనిపోయి పర్ణశాలకుఁ
దినిపించెను గొన్ని మధురదివ్యఫలంబుల్. ౯౨

కం. నిలఁబడి బద్ధాంజలియై
పలికెం దగఁ బరమహంస "పరశివుఁడవు; చిం
తిల దీనోద్ధరణార్థం
బిలపై జన్మించినాఁడ వేలా పెక్కుల్?" ౯౩

మ. అనుచున్ వాని శరీరమంటుచును గా
ఢాశ్లేషముం జేయు చా
తని నెమ్మోమున మోము గ్రుచ్చుడు విశు
ద్ధంబైన తత్ప్రక్రియల్

కని యున్మత్తుఁడో? యంచు నెంచు; ముఖరే
ఖలఁ గాంచి బ్రహ్మజ్ఞుఁడో?
యని శంకించు; నరేంద్రుఁ డయ్యె విచికి
త్సాయత్తచిత్తుం డిటుల్. ౯౪

కం. బాలోన్మత్తపిశాచులఁ
బోలెం గాన్పించు జ్ఞాని; బుధవరు లెఱుఁగం
జాలుదురు తద్విభేదముఁ
బాలను మజ్జిగను దెలియు వడువునఁ బుడమిన్. ౯౫

గీ. అంత శాంతిల్లఁ బారవశ్యంబు రామ
కృష్ణుఁ బాఁదటఁ గోర నరేంద్రుఁ డచట
సమ్మృతమేఘంబువర్షించు నవ్విధమున
నామసంకీర్తనంబు నొనర్పఁ దొడఁగె. ౯౬

కం.* “మనసా! స్వదేశమునకుం
జనుమా! పరదేశమైన సంసారమునం
దనయముఁ బరిభ్రమింతువు
మునుఁగుచుఁ దేలుచును దుఃఖముల సహారహమున్” ౯౭

ఆ. వె. ఇట్లుపాడ, రామకృష్ణుని చిత్తంబు
పోయెనో స్వదేశమున? కతండు
గాననో ? యోగనిద్రఁ; గూర్చున్నవాఁ డట్లె
కదలకుండనుండెఁ గనులు మూసి. ౯౮

* “మన్ చలో నిజనికేతనే,
సంసార బిదేశే బిదేశిర్ వేషే భ్రమ కేనో అకారణే.”

గీ. ఎంతకాలంబు పాడెనో యెఱుఁగఁడాన
రేంద్రుఁ; డా రామకృష్ణుండు నెఱుఁగకుండె
నెంతతడ వాసమాధిలో నిట్టులుండెఁ;
జాలతడవున కిర్వురుఁ దేలుకొనిరి. ౯౯

కం. పరులనువలెఁ బ్రశ్నించెను
నరేంద్రుఁ డాతని "మహాత్మ! నాకుం జెపుఁడా!
దరిసించితిరే మీరలు
పరాత్పరు?" నటన్న లెస్స వదనము విఱియన్. ౧౦౦

కం. "అఁడుగో నోయీ! కానం
బడు భగవంతుండు నాల్గు వలఁకుల; నినుఁజూ
చెడురీతిఁ జూతు; నిఁక వే
మడుఁగుల విస్పష్టముగను మరియుం జూతున్. ౧౦౧

ఆ. వె. చూడఁగలవు నన్నుఁ జూచిన ట్లీవు; నా
తోడఁబోలె మాటలాడఁగలవు;
పడుగుపేకలుగను వ్యాపించె భగవానుఁ
డేల కానరాక మూల డాఁగు? ౧౦౨

కం. రవికోటిభాసమానుం
డవలోక్యుఁడు గాక యుండునా? నాతండ్రీ!
అవలంబించు నె మూకత?
ప్రవచింపక తా సహాస్యవదనుం డయ్యెన్. ౧౦౩

కం. నరమాత్రుఁడైన ఱేనిం
దరిసింపంగా, గడింపఁ దదనుగ్రహ మి
ద్ధర దుశ్శకంబు ; సులభమె ?
కరణాగోచరునిఁ గాంచఁగా భగవంతున్ ? ౧౦౪

గీ. ఉదధి మథియింప నుబికెఁ బీయూషఘటము ;
జ్వలన మావిర్భవించుఁ గాష్ఠముఁ గలంప;
బహు తపఃక్లేశములఁగాని భవ్యమైన
బ్రహ్మసాక్షాత్కృతిం బొందరాదు సుమ్ము ! ౧౦౫

ఆ. మబ్బువాయఁ జంద్రమండల మట్టులు,
ముసుఁగుఁదీయఁ బసిఁడిబొమ్మ యట్లుఁ,
బాయఁజేయఁ దనదు ప్రతిబంధకతమంబు
రవిసహస్రకాంతిఁ గ్రాలు నతఁడు. ౧౦౬

గీ. తల్లికై చంటిబిడ్డచందమునఁ, బ్రియుని
ప్రాప్తికయి చూచు ప్రోషితపతిక పగిది,
దేవతాదర్శనమునకై తీండ్రమైన
తహతహావహింప నతఁడు ప్రత్యక్షుఁడగును. ౧౦౭

కం. తనపొక్కిటి కస్తురివల
పును దెలియక నలుఁగడలకుఁ బోడిఁ బఱచు మృగం
బన జనుఁడు లోనివానినిఁ
గనఁజాలక లోకమెల్లఁ గట్టా ! తిరుగున్." ౧౦౮

కం. అనవుడు నరేంద్రుఁ డిట్లను
కొనె; "దేవునిఁగంటివన్న కోవిదుఁ గనుఁగొం
టిని నైదంప్రాథమ్యము
గ నేఁడు; నాపంట పండుఁ గాఁబోలు నిఁకన్. ౧౧౯

కం. భగవద్గానము వినఁగనె
యగు మాతృస్వరము విన్న యర్భకునివలెం;
దగులున్ సమాధిని ప
న్నగపడు నిర్మిథ్యుఁడుగనె యాలోకింపన్. ౧౨౦

మ. తొలిచేఁతల్ పలుకుల్ మదిన్ సుషఁగుగాఁ
దోఁపించెఁ గానీ సము
జ్జ్వలతన్నేత్రయుగంబు వెల్వడెడి తే
జోరేఖ లేమందు? శృం
ఖలలై నన్నుఁ గడింది గట్టివయిచెన్;
గ్రమంబు లవ్యాని సగా
క్తులు గాఢానుభవప్రకాశకము లెం
దుం జూడఁబో! యీదృశుల్. ౧౨౧

కం. వెలి కుబ్బుచుండెనో లో
పలఁగల తచ్ఛుద్ధసత్త్వభాపుంజ మనన్
బలితుండై యాపదశిఖ
మలోకసామాన్యమగు మహత్త్వమునఁ దగెన్. ౧౨౨

ఆ.వె. పరుసవేది సోఁకు వడసిన యినుము బం
గారమయినపగిది ధీరవర్యు
రామకృష్ణుస్పర్శఁ బ్రాపించి క్రొత్త తే
జమున వెలుఁగుచున్న సరణి నుంటి. ౧౧౩

సీ. భవనకోణస్థమగు తేనెపట్టుఁ గనక
కాని కానలఁబడినట్లు కానఁబోక
ప్రక్కనేయున్న బ్రహ్మిష్ఠుఁ వ్యర్థముగను
దేశదేశంబులం జెడఁదిరిగికొంటి." ౧౧౪

కం. అని తాఁ దరించినట్లే
యనుకొని "ప్రొద్దయ్యె నేఁటి ; కానతిఁగొని నేఁ
జని మగిడివత్తు" ననుకొని
పునరాగమమునకు శపథము నొసర్చి చనెన్. ౧౧౫

సీ. పంపెనే కాని "క్రమ్మఱ వచ్చునా? న
రేంద్రుఁ డని రామకృష్ణుండు, నెపుడు మరల
నాశ్రమంబున కేగుదు?" నని నరేంద్రుఁ
డుచు విటీవిటులట్లు కొట్టుకొని పెనఁద. ౧౧౬

సీ. పయనమగు; నేదొ యడ్డంకివచ్చి యాఁగు
సగము దవ్వేఁగి వెనుకకు జను పథంబు;
తొందరించినకొలఁదియు దూరదూర
మరుగు వాంఛితమైన లక్ష్యంపుసిద్ధి. ౧౧౭

కం. మఱల నొకానొక దినమున
నరేంద్రుఁ డాపూజ్యదర్శనముసేసి యద
శ్చరణాంబురుహద్వయమున
కెరఁగఁగ నాతాఁకుకతన నేమి వచింతున్? ౧౧౮

మ. భ్రమియింపందొడఁగెం జరాచరపదా
ర్థంబుల్, కుటీరంబు నం
దుముహూర్తంబున; నాశ్రమీయతరుసం
దోహం బొగి నూర్ధ్వమూ
లమథశ్శాఖముగాఁ గనంబడెఁ; గరా
ళంబైన వాత్యన్ స్వదే
హము గారాకన మింటిపై నుడియుచు
న్నట్లయ్యెఁ జిత్రంబుగన్. ౧౧౯

కం. క్రమముగ నీయావద్వి
శ్వమునుం దానును లయంబుఁ బ్రాపించు విధం
బు మదిం దోఁప నరేంద్రుం
డమాంతముగ నఱచె గడు భయంబున నిట్టుల్. ౧౨౦

ఆ.వె. "నన్ను మీ రేమిచేయుచున్నారు స్వామి !
ఇల్లువాఁకిలి గలదు నా; కింటియొద్దఁ
దల్లిదండ్రులు గలరు; భ్రాతలును గలరు;
బ్రదుకనీయుండు పదియేండ్లపాటు నన్ను." ౧౨౧

కం. అని విహ్వలగాత్రుండయి
మనంబు ఘూర్ణిల్ల, నోటిమాటలు దడఁబా
టును బొంద, మోడ్చి కేల్దో
యినిఁ గలియఁగఁ దెలివిమఱపులిటు బిట్టుఱచెన్. ౧౨౨

కం. శిరసునఁ గరతలమిడ నం
త రామకృష్ణుండు స్వస్థతంగానె నతఁ; డ
త్తఱినిం దుపా నడంగిన
తెఱఁగున దారుణపరిస్థితి ప్రశాంతిల్లెన్. ౧౨౩

కం. నిపుణమ నరేంద్రుఁ డెన్నను
సవిస్తరముగా నెఱుంగఁజాలుదు వారా
యువి శేషము; లిచ్చ్యాది చా
లు వత్స! నేఁటి కని దయ విలోకించెఁ దగన్. ౧౨౪

కం. మఱియొక్క దినమునం దా
నరేంద్రుఁ డొడలంట నాక్షణముననె బాహ్య
స్మరణంబు దొలఁగి యాతఁడు
తురీయదశ నందికొన్న ట్రోవఁ గనఁబడెన్. ౧౨౫

ఆ.వె. ఆనరేంద్రు డిట్టు లాయాయి యనుభూతు
లందు "చింద్రజాలమా? యథార్థ
మా? యిదెల్ల" యంచు మనసునఁ జింతించు
నమ్ముచుండు; మరల నమ్మకుండు. ౧౨౬

కం. " ఇదమిత్థం "బని వానికిఁ
దదీయమగు తత్త్వ మవగతము గాదయ్యెన్
మది బలవంత మొనర్చెను
బదింబదిగఁ దన్ను శిష్యభావము నొందన్. ౧౨౭

కం. అలరామకృష్ణుఁ డొకపరి
నలరంగఁ దపస్సమాధి నగపడె సప్త
ర్షులలో నొకరుఁడు వసుధా
తలంబున నరేంద్రుఁడై నతారించి నటుల్. ౧౨౮

కం. మరియొక్కదివసమున గో
చరించెను నరేంద్రు భావిచరితం బెల్లం
గరబదరసమానంబుగ
నిరంతరధ్యానయోగనిష్ఠం జెలఁగన్. ౧౨౯

కం. విడువంజాలక విడుచును
వెడలంగాఁజాల కెట్లొ! వెడలుచునుండన్
ముడివడఁగఁ బ్రీతి భక్తుల
నెడందలుగడు, గురు శిష్యు లేకమయి రిటుల్. ౧౩౦

మ. తనకుం దెల్పిన నాఁటి కెవ్విధముచే
తం గాని రాకుండనే
ని నరేంద్రుం డలరామకృష్ణుఁడు విష
ణ్ణీభూతచిత్తంబుతోఁ

జని కాళీచరణారవిందముల ప
జ్జన్ వ్రాలి వేఁడున్ "నరేం
ద్రుని రప్పింపవె! తల్లి! వానిముఖచం
ద్రుం జూపవే?" యంచునున్. ౧౩౧

కం. నలుఁగడల నరేంద్రుండే;
యలసస్వప్నసమాధులందు నాతఁడె తోఁచెన్;
బిలుచు 'నరేంద్రా!' యని య
న్యుల; బ్రహ్మపదార్థమయ్యె యోగి కతఁడిటుల్. ౧౩౨

కం. ఒకబాలునికై యిటు వా
ర్థకనిర్మగ్నుఁడగు తాను దపియించుట యే
టి కటంచు ముడుఁచుఁ దన మో
మొకత్రుటి; ధ్యానించు మరల నొకత్రుటి నతనిన్. ౧౩౩

సీ. రామకృష్ణుండు శిష్యవర్గంబుతోడ
నా నరేంద్రునిఁగూర్చి యాడు నిట్లు
"షోడశదళాబ్జములు మీరు; చూడుఁ డీన
రేంద్రుఁడు సహస్రదళపద్మ; మిది నిజంబు. ౧౩౪

సీ. బురదఁ దాఁకని కుమ్మరిపురుగుపగిదిఁ
బద్మినీపత్త్రమంటని వాఃకణ మటు
క్షితిని సంసారయాత్ర సాఁగించుచున్నఁ
గామరాగవిలిప్తుండు గాఁ డతండు. ౧౩౫

గీ. ఆతనిది వేయునేల విహంగయాత్ర;
అరసిచూడఁ బిపీలికాయాత్ర మీది;
హస్తిమశకాంతరంబుండె నాతనికిని
మీకును; జగద్గురుత్వార్హతాకుఁ డతఁడు ౧౩౬

గీ. అతనికథ వే; యతండు దైవాంశమందు
సిద్ధుఁడయి పుట్టె; నిఁకఁగాఁడు బద్ధుఁ; డిట్టి
రవతరింతురు లోకకల్యాణమునకుఁ
జాల నరుదుగ జనతఁ బ్రశ్నిల నుహింపు. ౧౩౭

మ. తను బంధించిన మేఘమండలముఁ ద
ద్దం జీల్చి చెండాడి తె
స్స నిజద్యోతుల నల్గడంబఱచు కం
జాతాప్తు చందంబు దోఁ
ప నరేంద్రుండు స్వమాయఁ జీల్చుకొని ది
వ్యజ్యోతిచేఁ లోకమె
ల్లను వెల్గించు దినంబు రాఁగలదు స్వ
ల్పంబైన కాలంబునన్. ౧౩౮

కం. కమలాక్షుండో? కాఁడో?
విమర్శ గావింపుఁ డీరె వీనిని; సంశ్లా
ఘ్యములైన యోగికన్నులు
సుమి! వీనివి; లేదు బయలిచూపు వీతనికిన్. ౧౩౯

మ. నను శంకింత్రుగదా! నరేంద్రునిపయిన్
నా కింత మోజేల? యం
చును మీరెల్లరు; నిందువల్లనె చుడీ!
సూదంటురా యున్నతు
న్గను మాద్రిన్ దనవంకకున్ జగము నా
కర్షించి శాసింప జా
లు; నరేంద్రాహ్వాయ మర్థవంతమయి పో
ల్చుం గాళికాసత్కృపన్. ౧౪౦

గీ. అతఁడు గోమాంసముం దిన్న నంట దఘము;
కాల్చు జ్ఞానాగ్ని యెట్టి దుష్కలుషమైన;
నిత్యశుద్ధుండు, బుద్ధుండు, నిత్యముక్తుఁ
డతని కాతండె సాటి; లేఁ డన్యుఁ డొకఁడు. ౧౪౧

కం. శివుఁ డాతఁడు; శక్తిని నే;
నివి యుభయము గూడె నేని నేలా పెక్కుల్,
ప్రవచింపఁగఁ? బశ్చిమదిశ
రవిబింబం బుదయమొంది రారాజిల్లున్. ౧౪౨

చ. అని వచియించుచుండ హృద
యంబు ముడుంగఁగ లజ్జ రామకృ
ష్ణునికి నరేంద్రుఁ డిట్లనె; "న
నుం గుటియించి బహూక్తు లిట్లు లా

డిన మిము వెంగళప్పని క
డింది హాసింపరె? ముక్కుపచ్చలా
అని నను మీర్జగద్గురువ
నాదునటందురు; నవ్వుటాలకొ? ౧౪౩

సీ. "సకలవిద్యాచయం బవోసానముఁ గాని
గురుతపస్సిద్ధి నార్జించుకొన్న విజ్ఞు
లీ మహాభాగులేడ? నేనేడ? నిట్లు
పలుకకుం"డన బదులాడెఁ బరమహంస. ౧౪౪

సీ. "ఇవి స్వభావోక్తులే కాని యెంచఁ బోకుఁ
డతిశయోక్తులటంచు; మాయమ్మ దెలిపె
వీని భూతభవిష్యకథానకములు;
నమ్ముడా! నాదు ప్రత్యక్షరమ్ము మీరు." ౧౪౫

కం. అనుచున్ శిష్యులతోఁ బ
ల్కు "నరేంద్ర! నినుంగుఱించి లేనివి పలుకం
బనియేమి? నాదు నుడువులు
విను; తూచాతప్పు; దేల వేపలుకు?" లనెన్. ౧౪౬

కం. పరశివునిమూర్తి యంచును
నరేంద్రుడు శుశ్రూషఁ గైకొనంబోవఁడు; దాఁ
బరశిష్యులతోఁ బాటుగఁ
బరికింపఁడు పరమహంస పావను నతనిన్. ౧౪౭

కం. ఎవరే దెగడ నరేంద్రుని
"శివనిందాపాపమునకు సిద్ధపడితి రో
క్కో ? విమర్శింపకుఁ డాతని
నెవ రర్థముసేసికొందు రిట్టి"దని యనున్. ౧౪౮

కం. గురుదేవుం డివ్విధమున
నరేంద్రుఁ గావించు మన్ననం గనుఁగొని యా
పరశిష్యగణము రెండవ
గురుదేవునిఁగాఁ దలంచుకొనుచుం గొలుచున్. ౧౪౯

గీ. ఆనరేంద్రుండు బ్రాహ్మమతావలంబి
విగ్రహారాధనంబన్న విముఖుఁ డగుటఁ
గాళికాపూజనాదులఁ గాంచి నవ్వు;
మరిమరియు రామకృష్ణుండు మందలించు. ౧౫౦

కం. "ఈ నవ్విననోటనె నీ
వీ నా కాళింగుఱించి యేడ్తువు సుమ్మా!
జ్ఞానలవదుర్విదగ్ధు వి
ధానన్ మాటాడ" కంచు దద్దయుఁ దెగడున్. ౧౫౧

మ. ప్రవరోత్తంసుఁడు రామకృష్ణముని "స
ర్వంఖల్విదం బ్రహ్మ" యను
న్న వచోఽర్థంబును దెల్ప మొట్టమొదటన్
"నాబల్లి, నాకట్టి, నా

యఁవి సర్వంబగు వస్తువుల్ బళిర ! బ్ర
హ్మంబంట ! సీ ! కాదొకో ?
అవివేకం బిది" యంచు జేయు నపహా
స్యం బా నరేంద్రుం డొగిన్. ౧౫౨

ఆ. "జగము మిథ్యయంట; స్పష్టంబుగా నిట్టు
లలరుచుండ నెట్టులగును మిథ్య ?
వస్తుజాల మింత భాసిల్ల "నేహ నా
నాస్తి కించ" ననఁగ నగునె ?" యనును. ౧౫౩

గీ. మొదట నద్వైతసిద్ధాంత మదుకదయ్యెఁ;
దలకు రోఁకలి చుట్టుచందమున నుండె;
నా నరేంద్రుని యాదల హస్తముంచి
చొచ్చెను సమాధి రామకృష్ణుం డొకప్డు. ౧౫౪

ఆ.వె. ఆ నరేంద్రుఁడును సమాధినిష్ఠుం డయ్యెఁ;
దెరను దీసినట్టి కరణి నంత
నద్భుతముగఁ గాంచె నండపిండాత్మక
మయిన జగము బ్రహ్మమయము గాఁగ. ౧౫౫

కం. తన బల్లయుఁ దన కుర్చియు,
దన నానావస్తుతతియుఁ దగ బ్రహ్మంబై
కనఁబడె నరేంద్రునకు; నా
ఘనుని సహస్రార మది వికస్వరమయ్యెన్. ౧౫౬

సీ. అమృతవారాశి నిర్మగ్నుఁ డట్టు లతఁడు
బ్రహ్మమున మున్గి లెస్స దివానిశంబు
పొరి మనశ్శాంతి, నానందమును వహించు
చెల్ల బాహ్యప్రపంచంబు నెఱుఁగకుండె. ౧౫౭

కం. పగలు క్రమేణ గతించిన
పగిదిం దదవస్థ గడవ వచ్చెను నిశతీ
రుగ జాగ్రద్దశ ; యతనికి
నగపడె లోకంబు నీరసాత్మకమగుచున్. ౧౫౮

ఆ.వె. స్వానుభూతితోడ సద్వైతసిద్ధాంత
మయ్యె నాతనికిఁ గరామలకము
ఇనుమడించె రామకృష్ణునిపై భక్తి;
నెడఁద శంకలెల్ల నింకిపోయె. ౧౫౯

సీ. ఆమహాత్ముని తాఁకుచే నబ్బెఁ దనకు
నిట్టి దివ్యానుభూతి ; యీ ఋషివిధమున
స్వయముగ సమాధిలోఁ బ్రవేశంబుసేఁత
తనదు గుఱియంచును నరేంద్రుఁ డనుకొనె మది. ౧౬౦

ఆ.వె. "పసిఁడి సానరాయి పైనిఁ గీచినఁగాని
మేలు కీళ్ళు మనకుఁ దేల ; వట్లె
ననుఁ బరీక్ష సేసి నామాటలకుఁ గల
విలువఁ దెలియుఁడనుచుఁ బలికె స్వామి. ౧౬౧

మ. అరిగెన్ బైటికి రామకృష్ణుఁ డొకనాఁ;
డవ్వేళ కచ్చోటికిం
దరిసింపం జనుదెంచి లేమిఁగని త
త్తల్పంబులో నొక్క రూ
క రహింం బెట్టి నరేంద్రుఁ; డందుఁ బడుకోఁ
గా రామకృష్ణుండు దు
ర్భరవహ్నిం బొరలించినట్లొడలు త
ప్తంబయ్యె నొంటెన్ వ్యథన్. ౧౬౨

కం. కడుఁగడు క్షోభిల్లుచు నా
తఁడు పానుపుడిగ్గ; శిష్యతతి కనుఁగొని "యీ
బెడఁదేమని పురుగే దే
నడుగునఁ గలదేమొ?" యంచు నది గదిలింపన్. ౧౬౩

ఆ. వె. రూప్యమొకటి పెద్దమ్రోఁగుచు ఖంగున
"నేనె" యంచుఁ బడెను నేలమీఁద
రామకృష్ణుఁ డంతఁ బ్రశ్నింప నద్దాని
కత, నరేంద్రుఁ డరిగెఁగదలి యచటు. ౧౬౪

కం. నిజగురుని కామకాంచన
విజయంబును గాంచి శిష్యబృందము కడు స
హజమొందె; లజ్జితు నరేం
ద్రుఁజూచి మెచ్చుకొని గురుఁడు దోసములిపెన్.

కం. తఱచుగ నిట్లు నరేంద్రుఁడు
పరీక్షగావించి గురుని జ్వాలనంబున బం
గరుపూస సల్లెటించెను
బలిష్ఠమైపొల్చు తత్ప్రభావం బెల్లన్. ౧౬౬

కం. కనువిందగు తనప్రియు నినుఁ
గనుఁగొన్న సరోజకోరకముపగిది నరేం
ద్రుని. గన్న రామకృష్ణుని
మనంబు సంఫుల్లమగును; మరి యట్లయ్యున్. ౧౬౭

మ. తనపైనింగల భక్తిచందమును శో
ధన్ జేయఁగాఁ దొంటిరీ
తిని వీక్షింపక రామకృష్ణుఁడు కడున్
ధిక్కారముల్ సేయు; నే
పనిఁ గావించిన నెగ్గులెంచును; బదుల్
వల్కండు వెంటాడుచు
న్న; నరేంద్రుండు యథాపురంబు కొలువన్
వచ్చున్ దృఢాభక్తియై. ౧౬౮

మ. "ఘనుఁడెంతేల? నరేంద్ర! ప్రత్యహము నా
సామీప్య; మే నొక్కమా
టను మాటాడక మోము నెత్తి, యఱకం
టన్నైన వీక్షింపకుం

టెనిఁ; జీకొట్టెతి బిట్ట"టంచు గురుఁడా
డెన్ "దేవ! మీ రేమి సే
సిన దర్శింపక యుండ లే"నని వచిం
చెన్ శిష్యుఁ డుద్బాష్పుఁడై. ౧౬౯

కం. చనుచుండె నరేంద్రుఁడు తొలి
దినముల నపుడపుడు; పిదప దినదినమును భ
క్తినిబద్ధాంజలి గురుఁగను;
జనకున్నం దలఁచుఁ 'దప్పొనరిచితి' ననుచున్. ౧౭౦

కం. గురుదేవుండు నరేంద్రునిఁ
బరికింపఁగ మనసుపుట్టఁ బరుసంబై తా
తిరెఁ బెంజీఁకటి నాతని
యురవున కేతెంచుఁ దిరుగు చీమానందుల్. ౧౭౧

చ. పితరులు రామకృష్ణుపయిఁ
బెద్దయు బత్తినిఁ జూపుచుండియుం
సుతుఁడు విరాగియై యతని
సూక్తులలోఁబడి సన్న్యసించి సం
సృతిఁ ద్యజియించునో యని వ
హింత్రు భయంబును గోపమాత్మ; స్వ
హితుఁడును శాత్రవుండును న
రేంద్రుని దేశికుఁడయ్యె వారికిన్. ౧౭౨

కం. జననీజనకుల ప్రీతికై
చనును నరేంద్రుండు పాఠ్యశాలకు సతతం
బును, దనపిత్రాజ్ఞ మివ్విధ
మున నిర్వ్యాతన మొనర్పఁబూనెనొ బుద్ధిన్. ౧౭౩

౬. స్త్రీపరాఙ్ముఖత్వము (౧)

కం. కాళీఘట్టంబునఁ బర
బాలురతోఁ గూడిమాడి బాడుగ నిడుచున్
'బీలే' వసించుచుండె వి
శాలంబగు నొక్కగదిని సౌధంబుపయిన్. ౧౭౪

గీ. ఏకసంధాగ్రాహుండు వీరేశ్వరుండు
చదువఁ డశ్రాంత మన్యుల చందమునను
బరమభాగవతుండనఁ బరవశుఁడయి
ధ్యానమొనరించు భక్తిఁ గీర్తనము సేయు. ౧౭౫

కం. భగవత్సంకీర్తనమున
బగలును రేలును మునుంగఁ బ్రహ్లాదుఁ డనన్
మిగిలిన బాలురు వీనిని
నగుదురు దెగడుదురు చాటునన్ మూర్ఖనుచున్. ౧౭౬

గీ. కంటవత్తిడి తార్పరీక్షకుఁ బఠింత్రు
చెలియ దాతండు పొత్తమ్ముఁ దెఱచిన కత
అగ్రతాంబూల మతనిదే యాపరీక్ష
నక్కజంపడి లజ్జింతు రతనిఁగాంచి. ౧౭౭

గీ. చనక యొక్కొక్కతఱిఁ గళాశాల కతఁడు
మధురముగఁ గీర్తనముసేయు మఱచి తన్ను;
రాళ్లుగరఁగును; మొలకెత్తు మ్రాళ్లు; చూచి
గండుగోయిలపిండు వాక్కట్టుఁబొందు. ౧౭౮

శా. యాతాయాతజనంబు లాఁగి యదనీ
యంబౌ శ్రవఃపేయసం
గీతంబుల్ వినుచున్ దమున్ మఱచి యా
క్రేవన్ వినోదిం త్రహి
వ్రాతంబట్లు శిరంబులం గదుపుచుం
బల్మాఱు; లాతఁడు ద
ద్గీతిన్ మానినఁ బాడుచున్నటులె ష్లా
దింత్రాత్మ స్వాదించుచున్. ౧౭౯

కం. ఒకనాఁ డాతని సంగీ
తకముతఱిని వచ్చినిలిచె ద్వారస్తంభ
ద్వికమునకుఁజాఁచి కేల్గవ
నొకబాలవితంతు వంగజోన్మాదమునన్. ౧౮౦

కం. ప్రతివేళని యాసుందరి
యతనిం గ్రేగంట గాంచు; హాసిత మొనర్చున్;
మతిమాలి వానియెదిటికిఁ
బ్రతిగమనముసేసివచ్చు బాటను జనుచోన్. ౧౮౧

గీ. ప్రాహ్ణసాయాహ్నముల వీథి రాకపోక
లాచరించెడి తఱి దీర్ఘమైన వాని
నీడ ధనమీఁదఁబడునట్లు నెలఁత నడచు
చతనిఁ గౌఁగిలిగొన్నట్టు లలరుచుండు. ౧౮౨

సీ. అభ్యంజనంబాడి యారఁబెట్టినకురుల్
వింజామరంబయి వీవఁదొడఁగె
శృంగారరసమును జిమ్ము చూడ్కుల కల్వ
విరిదండ లెదయుందు వ్రేలఁదొడఁగె
జిలుఁగు పైకఁబిగిల్చి వెలికుబ్బు గుబ్బల
జంట గన్పడఁ బైఁట జాఱఁదొడఁగె
నాలింగనస్పృహాయాళువు లంగక
మ్ములు గడుంగడుగగుర్పొడువఁదొడఁగె

గీ. అఱముడిఁగిన కన్నుదామరలతోడ
మోదమున మున్కలాడు నెమ్మోముతోడ
నలసుధాజలయంత్రపు గళముతోడఁ
బాడుచున్న యువం గన్చె బాల సిలువ. ౧౮౩

గీ. నాగకన్యక చందానఁ దీఁగఁబోఁడి
డాసి మాతసయెదుట నాడందొడంగె;
బాహ్యమెఱుఁగదు నలరాజుపట్టియుంటు;
బాహ్యమెఱుఁగం డతండును భక్తిచేత ౧౮౪

కం. తరుణుండు మహాని గానముఁ
దెఱచెన్ నయనములు; కాని తెఱవ మొగముచెం
దురుఁగాంచి వాని యాత్మా
మరదోయియుమచ్చ్యుఁడిఁగె మరలం ద్రుటిలోన్. ౧౮౫

గీ. మరల జతనంబుతోఁ గనుల్ దెఱచి చూని
వైఖరి గ్రహించి యౌదలవాంచి పలికెఁ;
"చెల్లెలా! నన్నుఁజూడవచ్చితివె? పేర్మి
నేనె రావలె ననుకొందు నిన్నుఁజూడ ౧౮౬

గీ. బావ పోయినదుఃఖంబు పారమొయిద
కున్న నినుఁ బరామర్శింపకున్న యన్న
నన్ను మన్నించివచ్చిన నిన్నుఁగాంచ
సిగ్గిలుచునుంటి; వెఱతును శిరసునెత్త. ౧౮౭

కం. పతిశోకముచే హృదయము
కుతకుతలాడంగ శాంతిగూరమి నీదుః
స్థితి కౌషధంబుకై వ
చ్చితివని శంకించుచుంటిఁ జెల్లెల! యదెకా? ౧౮౮

కం. "మరణంబె ప్రకృతి జీవుల
కరయఁగ జీవితమె వికృతి" యని బుధులు వచిం
తురు; విధి గడవఁగరానిది
పరితాప మేడంద ప్రీల్చి ప్రయ్యు లోనర్చున్. ౧౮౯

ఉ. నిద్దుర లేచి తొంటికర
ణిం బరిణామిల్లుము! భర్తృచిత్రముం;
బొద్దుట సాయపుందటినిఁ
బూజలొనర్పుము వానివిగ్రహం;
బద్దము కన్నుదోయికిని
నా భగవానుని విగ్రహంబుగో;
నద్దియ నీకుఁగూర్చును మ
హత్తరశాంతిని నమ్ము! సోదరీ! ౧౯౦

కం. పరులను భావింతువు సో
దరులని; వర్తిలుదు దేవతాభక్తిని; నీ
వెఱుఁగుదువు పుణ్యసాధ్వీ
చరితములు; వచింపఁదగ్గ సంగతు లున్నే? ౧౯౧

మ. చనుమీా! సోదరి! యింటి; కింకెప్పుడు నీ
చందాన రాఁబోకు! ని
న్ననుమానింతుసు; సాధ్వి మైథిలికె క
ట్టా! యెట్టి నీలాపనిం
దను గల్పించెను; గాకిమూఁక యనుచున్
సమ్మందగున్ లోకమున్;
మనుమీా! సందగపట్టరానిగతి మా
న్యంబైన శీలంబునన్. ౧౯౨

చ. అని వచియించినం జనక
యట్టులె చిత్తరుబొమ్మకై వడిం
గనుచుఁ, దనుం గటాక్షతతిఁ
గట్టుచునున్న లతాంగిఁబాసి యా
ఘనుఁ దురితాళ్ళిఁ ద్రెంచుకొని
క్రన్నన బైటికిఁ గాలుదూసి వ
చ్చిన హరిణంబురీతి నిలి
చెం దిగి సౌధమునుండి క్రిందికిన్ ౧౫-౩

౬. స్త్రీప్రరాజ్ముఖత్వము (౨)

కం. చనె నొకనాఁడు నరేంద్రుఁడు
వనంబునకు స్వీయసఖుల ప్రార్థనఁ దద్వా
హనముపయిన్ వాహ్యాళికి
వినోదమొప్పార సంజవేళం బ్రియతన్. ౧౫-౪

కం. ఫలములతోడ, రసాయన
ములతోడ, మిఠాయితోడఁ బొలుపారఁగ వె
న్నెలవిందు లారగించిరి
యల చెలికాం డ్రచటి రమ్యహర్మ్యమునందున్. ౧౫-౫

ఆ. పుచ్చపువ్వుచందమునఁ బండువెన్నెల
గనులవిందుగాఁగఁ గాయుచుండె
మలయమారుతములు మలయుచుండెను ; గీర
శారికాళిపాడె శ్రావ్యగీతి. ౧౫-౬

కం. ఆటలలోఁ, బాటలలో,
మాటలలో నొకరినొకరు మరియుఁ గడచి పూఁ
దోఁట విహరించి "మన మీ
పూట వసింతమిటఁ బ్రొద్దువోయె" నని రోగిన్. ౧౯౭

కం. "అదిపాడుమోయి! బీలే!
ఇది పా"డని తమకుఁ దమకు హితమగు పాటల్
పదుగురుఁ బాడించుచు న
య్యదన న్నాయాసపఱచి రాతనినిఁ గడున్. ౧౯౮

ఆ.వె. "విశ్రమింపు" మనుచు బీలేకు గదిసూపఁ
బోయి యతఁడు దలుపు మూసి పండె;
వెలిసె నంత గదిని గలగల మంజీర
కంకణారవములఁ గలికి యొకతె. ౧౯౯

కం. తెరచాటున నిలఁబడెనో!
పరికింపఁగ రాక కలదొ? పానుపుక్రిందన్;
అఱబిత్తలయై కన్నులు
మిఱుమిట్టులు గొలుపుచున్న మెయిజిగి మెఱయన్. ౨౦౦

కం. కొరడాలోవలె జడలో
శరములలోవలెఁ గటాక్షజాలములోఁ దా
గుఱిసేసి గుండ్లలోవలె
నగుదెంచెను బొమ్మలొడ్డి యతనిం దాఁకన్. ౨౦౧

కం. జిలుఁగుల, లలితాంగమ్ముల,
నలరుసరుల, వలపుఁజిమ్ము చది మోహిని నాఁ
దళుకులు బెళుకులు, గులుకులు
నొలికించుచు నడచి పాన్పునొద్దన్ నిలిచెన్. -౨౦౧

చ. తెఱచి యతండు గన్గవను
దివ్యవిలాసినిసోలె నున్న య
త్తెఱవను గాంచి యద్భుతమ
తిరెన్ వడిఁ దల్పము డిగ్గి "అమ్మ! యె
వ్వరితవు? మూసినట్టిదగు
ద్వారము మూసినయట్టులుండె; నె
క్కరణినిఁ జొచ్చి తీగదిఁ ద
గం బ్రతిబింబకమద్దమం దటుల్. -౨౦౩

కం. పరపురుషుఁడనగు నాద
గ్గఱి కిట్టి నిశీథమం దొకర్త విటుల్ నీ
వరుదెంచుట గర్హ్యము; నీ
చరిత్రమున మచ్చవుట్టు సాధ్వీ! చను" మనెన్. -౨౦౪

కం. కలకలనవ్వులు దీపపు
వెలుంగుఁ గీడ్పఱచి పండువెన్నెలఁగాయన్
బలుకులఁ గురియుచుఁ దియ్యని
పులకండంబులు నచించెఁ బూఁబోఁడి యిటుల్. -౨౦౫

కం. "ఇది నాగది ; యిది నాపా
ప్పదిగో ! నీసఖులు నాకు హితసఖులు ; భవ
త్సదృశుల కాతిథ్యంబిడు
చుఁ దలంతుఁగా సతత మొంద శోభనశతముల్. ౨౦౬

కం. పరపురుషులు స్వపురుషులని
పరికింపము మేము భేదభావము ; మాకే
ల్లరును సఖులె ; మాచరితము
సరసస్తుత్యము ; సదా వసంతమె మాకున్. ౨౦౭

కం. "కొను మిదె! పాద్యం"బని యా
తనిపయిఁ బన్నీరు సల్లి తడయక "యిదె! కై
కొను మర్ఘ్య"మంచుఁ దనకర
మునఁ గల మల్లియలు విసరిపుచ్చె నతనిపై. ౨౦౮

ఆ. వె. బెడఁదవచ్చెనంచుఁ వెన్కవెన్కకు రోసి
జరిగె మొగముముడిఁచి ; జాఱఁబైఁట
వాని కేలువట్టఁ బోఁత నాజంతయు ;
సందకతఁడు సురిగె నందు నిందు. ౨౦౯

కం. దినమును నిశచందంబున
నిను సంధ్యాకాంతవోలె నెనోష్ణ గతులం
గొని, వానిఁబట్ట యత్నిం
చిన నాజవ్వని కతండు చేపడఁ డయ్యెన్. ౨౧౦

కం. గలగలమ్రోయఁగ నూపుర
ములు పరుగిడు చతనిఁ బట్టు పూనికిఁ బడెఁ గా
ళులకడ్డఁగఁ బావడ కు
చ్చెలు ; కుమతుల తలఁపులెల్ల సిద్ధము లగునే ! —౧౧౧

కం. వలఁజిక్కి చించి యెట్లో
వెలికుఱికిన పులుఁగువోలె “ బీలే ” వడి నీ
వలఁబడి గ్రహించి యది మి
త్రులకున్ద్రని వారిఁజూడ గోసి మదిఁ జనెన్. —౧౧౨

కం. ప్రవరాఖ్యుని యవతారమొ ?
నవీన లీలాశుకుండొ ? నారీవిముఖుం
డవసని మరొక్కఁ డెవ్వఁడు ?
పుష్పవిల్తుని దాసులయిరి ముప్పురుమూర్తుల్. —౧౧౩

## ౫ దారిద్ర్యము - దైవప్రార్థన

కం. జనకుండు విశ్వనాథుఁడు
చనస్వర్గంబున కొనర్చె సహగమనం బా
యన వెనుకలిమియు నాతని
వెనువెంటనె పుణ్యసాధ్వి వితమునఁ గట్టా! —౧౧౪

గీ. తల్లి భువనేశ్వరీదేవి తారు దోడఁ
బుట్టువులు నల్వురును బాసిపోవలిబ్బి
నెండబెట్టకు నీరెల్ల నింకిపోవ
బైటఁబడినట్టి చేపలపాటు గొనిరి. —౧౧౫

ఉ. గుండిగలోని కాపురము
గుప్పిటిలోనికివచ్చెఁ; జుట్టమొ
క్కండును జూడరాఁడు; చెలి
కాఁడొకఁడేనియుఁ బల్కరింప రాఁ
డండెను; నుత్తమర్ణులు గ
టా! యమకింకరులట్లు చుట్టిరి; రా
లెం; డిల సందుఁజూచి కబ
ళింపఁ బయింబడు నెల్లనర్థముల్.

కం. అఱకముపుకోడ మూసిన
చిరిగినపుట్టంబుకోడఁ జెప్పాలయిన తే
కరుగుఁ గళాశాలకు నా
నరేంద్రుఁ డోర్పుమెయిఁ గాలినడఁ గడువవ్వల్. –౨౧౭

చ. నెలితిపసందు లేదనుచు;
స్వీయకుటుంబపుఁ గష్టపాటు తె
ట్టుల్పా? గ్రహించి యొజ్జలు క
డుం దయనొంది నరేంద్రు విందుకై
పిలుతురు; పస్తుఁబండుకొనఁ
బిన్నలుఁబెద్దలు నింటఁదాఁ దినం
దలఁచునె? చెల్పి గొనెపమొ!
తప్పుకొనుం బలుమాఱు లొప్పుగన్.

కం. తన బడిజీతముఁ గట్టిరి;
తనయింటికి భోజ్యవస్తుతతియు ధరింపం
గను నూత్నవస్త్రజాలం
బనిపిరి; యాతం డెఱుంగఁడయ్యెను వేఁకో? ౧౧౯

కం. "పనిచితి వీవే" యని యో
జనములో! తెచ్చిచ్చిరంచు శోణాచార్యుం
డును, జనయిత్రియుఁ దెలిపిరి;
యనేకయత్నము లొనర్చె నాచూకి గొనఁగ. ౧౨౦

కం. ధనయౌవనవరలావ
ణ్యనిధానంబయిన యొక్కయంగన యమ్మో
హనమూర్తికొఱకు డెందం
బున నువ్విళ్లూఱు నింటిముం దరుగుతఱిన్. ౧౨౧

కం. ప్రతిదినముఁ గళాశాలకు
గతాగతంబుల నొనర్చు కాలంబున నా
సతి చక్కఁగ ముస్తాబై
రతివలె నమ్మదనమూర్తి రహిఁ వీక్షించున్. ౧౨౨

ఆ. వె. వెడలునపుడు వానివెంబడిఁజని మళ్లు;
వచ్చునపు డొనర్చు స్వాగతంబు;
మల్లెపూలఁజల్లు; నల్లకల్వలు గప్పు
మగువచూపు వాని మార్గమందు. ౧౨౩

గీ. ముక్కునకుసూటిగ నతండు పోవుఁగాని
శిరముఁ బ్రక్కకుఁద్రిప్పి వీక్షింపఁ డెవరిఁ;
గలికియొక్కతె తనపైనిఁ గన్ను వేసి
యిట్టులు వ్యయించుచుంట నూహింపఁ డయ్యొ. — ౨-౨౫

చ. "త్రికరణశుద్ధిగా నిను వ
రించితిఁ; దావకపాదపద్మసే
వకుఁ దపియించుచుంటి; నెల
ప్రాయము జన్నియవట్టియుంటి; మ
త్సకలముఁ గోడ నాకగుము
స్వామివి; నాదగుకోర్కెఁ గాయ సే
యుము; దయసేసి మానుకగృ
హం బొనరింపుము! స్వర్గభూమిగన్.

కం. ఈయావదాస్తియును నీ
దే; నేఁ బ్రతినిధిని; విని త్వదీయస్థితి నా
థా! యువ్వి యివ్వి పంచితి
నీయానతిఁ గొనక; సైఁపు నేరము నోమిన్." — ౨. ౨౬

కం. అని వ్రాయఁబడిన యొక లే
ఖను గ్రిందటనున్న సంతకముఁగని తన పే
ధినినున్న జమీందారుని
తనయుఁడుని గ్రహించి రోసి దానినిఁ జించెన్. — ౨-౨౭

కం. ఆనాఁటినుండి యూతం
డా నవలాయింటివీథి కడుగునిడక చు
ట్టైనను మఱొక్క మార్గము
లో నిచ్చలు రాకపోకలు పొనర్చుఁ దగన్. ౧౨౭

కం. ఒకదినము తపాలావాఁ
డొక మడఁచినకమ్మఁ దెచ్చె; నొగిఁ దెఱవంగా
నొక పదివేరూకల "చె
క్కు" కానఁబడి యక్కజంబుఁ గొలిపె నతనికిన్. ౧౨౮

కం. "కనువిందైతివి; మును నా
పెనిమిటితో నాగృహంబు విజయంచేయన్;
నినుఁజూపి యేఁగుగడగాఁ
జనె నాతఁడు నెలకుముందు స్వర్గంబునకున్. ౧౩౦

కం. వినితివి నాదౌర్భాగ్యము;
వినితి భవద్దుర్గతియును; వెనుకెవ్వరు లే
ర్వీను నాకు; నీవె సర్వం
బనుకొంటిని; భర్తృమిత్రుఁ డాత్మీయుఁడె కా! ౧౩౧

కం. ఈపైకము నీకిమ్మని
నాపతి సెలవిచ్చె; నీవు నాకగుదునటం
చూపిరితో నుంటినిఁ గా
కీపాటికి నతనివెంట నేఁగియ యుందున్. ౧౩౨

సీ. జలధరమునకుఁ జాతకలలనవోలె
జాబిలికి వెన్నెలపులుంగు చందమునను
స్వాతివానకు శుక్తియువలెనె యో న
రేంద్ర! నీరాకకై పెద్ద యెదురుసూతు." ౨౩౩

కం. అని యున్న జాబునుం గని
ననఁబోఁడి తలం పెఱింగి నానాకథలున్
వినియుంట దానిఁగూఱిచి
వెను వెంటనె యతఁడు ద్రిప్పివేసెను "చెక్కున్." ౨౩౪

కం. సిరతము దారిద్ర్యాంబుధిఁ
దరింపఁదరి లేక బిట్టు తప్పుండయ్యున్
సిరిరా మోఁకాలొడ్డిన
నరేంద్రుఁడు యతీంద్రుఁడే యనం జెల్లదొకో? ౨౩౫

కం. ఒకనాఁడు రామకృష్ణుని
నికటమునకుఁ జని స్వకీయనిష్ఠుర దారి
ద్ర్యకఠోరయాతనలు విని
చి కరంగఁగఁ జేసె నతని చిత్తంబు గడున్. ౨౩౬

సీ. "మనవిరెమునరించి లోకైకమాతయైన
కాళికాదేవి నా కనుగ్రహము సూపు
క్రమముఁ జింతింపుఁ; డాతల్లి "కాదు నాదు"
భక్తజనకల్పవల్లి మీ ప్రార్థనంబు." ౨౩౭

గీ. అని నరేంద్రుండు ప్రోల దీనాననమున
నిలువ శ్రీరామకృష్ణుండు వలికె నిట్లు
"వేడవైతివి ము; న్నింక వేడఁబోవ
వెడఁగుకోర్కులు నాకేనిఁ బెజులకేని." ..౨౩౮

కం. అని నిర్మోగమోటంబుగఁ
గనికర మది లేనివానిగతి వని "ఓయీ!
చని నీవయి ధ్యానింపుము
మనోరథముఁ దెల్పి లోకమాతను భక్తిన్." ..౨౩౯

చ. అనుడు నరేంద్రుఁ డేఁగి విన
యంబున సాఁగిలి దేవిముందటం
దనమదికోరికె ల్మఱచి
"తల్లి! మరల్చి ప్రపంచదృష్టి నా
కనయ మొసంగుమమ్మ! భవ
దంఘ్రిసరోరుహాభక్తి, జ్ఞానముం
గనుఁగొని నన్ను సంసరణ
కూపమునుండి సముద్ధరింపుమా! ..౨౪౦

మ. అని ప్రార్థించి కడిందివచ్చె; "గురుఁ డ
భ్యర్చించితే?" యన్నఁ జే
సినవిజ్ఞాపనఁ దెల్పెఁ; "గ్రమ్మఱను సం
సేవించి యాచింపుమీ!

యనెనే; నాతండును మోఁకటిల్లి మరలం
ప్రార్థించె మున్నట్లు; "పా
హ్మ"నె నాచార్యుఁడు వెండియు న్నతఁడదే
యర్థించెఁ జిత్రంబుగాఁ. ౨౪౧

గీ. కాళికాదేవి సత్కటాక్షంబు; రామ
కృష్ణుని మనోరథంబు; నీ క్షితిపురంధ్రి
దివ్యచిత్తం బదేమొ! తెలియు నేరి?
కా నరేంద్రుండు ముమ్మాఱు నట్లు గోరె. ౨౪౨

గీ. పేడకై కామధేనువు వేఁడు నెవఁడు?
గోచికై చక్రవర్తినిఁ గోరు నేఁడు?
అర్థి చింతామణిని దేవి నాశ్రయించి
పామరుఁడుదక్క గోరఁ దప్పగిది నెవఁడు? ౨౪౩

గీ. దేవి దర్శింప డెందంబు దిరిగిపోయెఁ
ప్రాక్తనంబైన పుణ్యంబుపండి యప్పు;
డైహికకలాపమందు నిరీహుఁడయ్యె;
నక్కజంపడెఁ దవస్థ కతఁడె కడిఁది. ౨౪౪

కం. పలికెనిటు రామకృష్ణుఁడు;
"బలవత్తర మీశ్వరేచ్ఛ; ప్రాపింతువు ని
ర్మలభక్తిజ్ఞానంబులె;
యలకాళీమాంతహృదయ మార్ద్రము నీపై." ౨౪౫

## ౯. ఉపదేశము

గీ. తదుపదేశంబు శ్రుతిసమ్మితంబ యయ్యు
గాదు ప్రభుసమ్మితం ; బింక గమ్మసదగు
మిత్రసమ్మితమై సమున్మేష మొసఁగి
హృదికి నానందసందోహ మిచ్చుచుండు. -౨౬౬

కం. ఒకనాఁడు నరేంద్రాదులు
ఒకచోఁ గూర్చుండి " దేవుఁడున్నాఁడె? త్రిగుణా
ప్రకరం బపౌరుషేయమె?
సకలంబగు శాస్త్రచయము సత్యమె"! యనుచున్. -౨౬౭

గీ. కడచి యొండొరులను వాక్కౌశలంబు
వెలయు వాదోపవాదముల్ సలుపుచుండె;
రద్ది యాలించి నగుచు నేమనక గురుఁడు
వెడలె నదివైపు వారును వెంబడింప. -౨౬౮

మ. కనుఁగొం చాతటమందు నొండొరుల్తోఁ
గాట్లాడుచుం, జించుకొం
చునుగొంతుల్, బహుభంగులన్ మొఱుఁగు కొం
చుం, బైకె దూఁకాడుచుం
డినకొన్నింటిని, మెల్లఁగా మెదలకా
ఱెంకిం గనంబడ్డ పీ
నును భక్షించెడి శ్వావరాహకములం
గొన్నింటినిన్, నవ్వుచున్. -౨౬౯

కం. కనుఁగొనుఁడని శిష్యాళికిఁ
గనంబఱచె ; వారు దాని గ్రహియించి నతా
నను లై స్వశుష్కతర్కము
లను లేపక ధ్యానయోగలగ్నులయిరిఁకన్. —౨౫౦

కం. "తనుఁదాను దెలిసికొనుటే
సనాతనంబైన ధర్మసారము ; షడ్ద
ర్శనములు వేదంబులు నా
ల్గును జదివినఁ దల్లక్రిందులుగ వృథయ సుఁడీ ! —౨౫౧

కం. తనుఁదా జయించు నాతని
కనులకు సాక్షాత్కరించుఁ; గా కవ్విధిఁ జే
సిన నేండ్లుఁబూండ్లుఁ దపముల
నణుమాత్రంబేసి దేవుఁ డగపడఁడు సుఁడీ ! —౨౫౨

గీ. ఏడ్చినవె పిల్లనుం దల్లి యెత్తికొనును ;
గ్రాఁగినవె లెస్స పాలు మీఁగడ లభించు
గాఢసంతాపమునఁ జేసి కలుగుఁగాని
దైవసందర్శనము; గా దయత్నముగ మీకు. —౨౫౩

కం. ప్రతిమానవుఁడును మాధవు
ప్రతిబింబ మటంచు మీరు భావించుచు సం
తతమును సేవింపుఁడు ; న
న్నతారతమ్యంబు క్షాళనము సేయుఁ దుదన్. —౨౫౪

గీ. మీరు త్రికరణశుద్ధులై మెలఁగికొండు !
సరకుసేయకుఁ డన్యదూషణము లెపుడు;
కుక్క-మొఱుఁగుల జీతికింగాను నె య్యెన్న ?"
లనుచుఁ బ్రత్యుత్తరించు శిష్యాళి కతఁడు. —౨౫౫

కం॥ గురుదేవునోట్టి ప్రత్య
క్షర మసిధారావ్రతంబు చందంబున నా
చరణమొనర్చి నరేంద్రుఁడు
పరశిష్యగణంబునందుఁ బ్రముఖుం డయ్యెన్. —౨౫౬

కం. అరిషడ్వర్గముఁ ద్రుంచెను
విరాగదివ్యాస్త్రమూని వీరేశ్వరతన్ ;
ధరణి సనాతనధర్మో
ద్ధరణమొనర్పన్ నరేంద్రతన్ మది నూనెన్. —౨౫౭

మ. తన శిష్యావళిలో నరేంద్రుఁడొకఁడే
తారాగణంబందుఁ జం
ద్రుని చందంబున వెల్గుటంగని తదిం
దుం డెప్పుడున్ వృద్ధిఁబొం
ద, నమావాస్యలుఁ, గృష్ణపక్షములు క్షీ
ణత్వంబు గల్పింపకుం
డను, బ్రార్థించును రామకృష్ణుఁడు జగ
న్మాతన్ మహాకాళినిన్. —౨౫౮

గీ. రామకృష్ణుని వదనచంద్రామృతంబు
నానరేంద్రచకోరకం బానుచుండుఁ ;
దరుగ దొకబిందువేని సుధారసమునఁ;
దనియదు చకోర మెన్నాళ్లు ద్రావుచున్న. ౨౫౯

కం. "తన యాధ్యాత్మిక సంపద
కనంతరీయుఁడు నరేంద్రుఁ డభయమిడి మిముం
గని పెట్టు నాతఁ"డని ప
ల్కెను శిష్యులతోడ రామకృష్ణుఁ డొకతఱిన్. ౨౬౦

మ. దినముల్ రాత్రులు నిర్వికల్పకసమా
ధిన్ మున్గి బ్రహ్మైకని
ష్ఠ వినోదించెడి భాగ్యలబ్ధి కభిలా
షం దెల్ప శిష్యుం 'డెఱుం
గవు కాఁబోలును దానికంటె శతధా
గా శ్రేయమైనట్టి భా
గ్యవిశేషంబును నున్నదోయి !" యని య
య్యాచార్యుఁ డున్నేత్రుఁడై. ౨౬౧

గీ. నిర్గుణబ్రహ్మ మొంటి ధ్యానించుకొనుచు
సకలశాస్త్రపరతుఁడౌ టసాంప్రతంబు ;
స్వయముగాఁ దీక్షుఁడగువాఁడు సలుపవలయుఁ
బరుల నుత్తీర్ణులుగఁ; గా కెవండు సలుపు? ౨౬౨

ఆ.వె. ఒక్క దివ్వె వెలిఁగి పెక్కింటి దూఁదిన
త్తులను దివ్వియలుగ సలుపుపగిదిఁ
దీర్ణుఁడైనవాఁడు దీనుల లాఁతులఁ
దగవుసుమ్మ! తీర్ణులుగ నొనర్చు. ౨౬౩

క. అరయఁగ సగుణబ్రహ్మము
చరాచరంబైన జగము; జగతీరూపుం
బరమాత్మను సేవించుటె
పరులఁ దరింపించుటనఁగ భావింపు మెదన్. ౨౬౪

సీ. కడుపుఁజిచ్చార్పఁ గ్రుక్కెఁడు గంజి దొరకక
మలమల పలుమంది మాఁడుచుంద్రు
మానసంరక్షకై మేనికై జింకిపాఁ
తయు లేక పెక్కండ్రు తలఁకుచుంద్రు
తగు మందుమాఁకులొప్పఁగు పథ్యపానముల్
వడయక కొందఱు మడియుచుంద్రు
కడు మూర్ఖులై నిరక్షరకుక్షులై యథః
పతితులై యెందఱో బ్రతుకుచుంద్రు.
గీ. మనలలోపల నున్నట్టి తనరుఁగాదె?
భగవదంశంబు వీరి లోపల నరేంద్ర!
ఇట్టి దీనులసేవయు నేల పెక్కు?
భగవదారాధనంబని వలయుఁదలఁప. ౨౬౫

కం. కనులర్పించెను గ్రుడ్డికిఁ;
దినఁగా బెబ్బులికొసంగె దేహంబు నహో!
ఘనుఁడుగద ! బోధిసత్త్వుఁడు;
మనెఁదా త్యాగుఁడయ్యు విడక మానవసేవల్. ౨౬౬

కం. వెలుపల, లోపల, సమగతి
వలయును బ్రహ్మానుభూతి వడయంగా, భా
సిలు పంచదారగోలీ
వెలుపల లోపలను నేకవిధి రుచిఁగొనమే ! ౨౬౭

కం. పరికింపరాక పరులకు
ధరణీగర్భంబునందుఁ దాఁగిన గని నా
నరుఁ డే గిరిగుహాయందో
నిరతంబు సమాధిలో మునింగిన ఫలమే ? ౨౬౮

గీ. పడయుదువు లెమ్ము ! నిర్వికల్పకసమాధి
నలఁతితడవుల ; నదియె లక్ష్యంబుగాదు ;
సగుణనిర్గుణముల నిట్లు సమరసముగ
జీవి యనుభూతినందుటే శ్రేష్ఠతరము." ౨౬౯

కం. అని తగ నుపదేశింపం
గ నరేంద్రుం డెట్లు నిర్వికల్పసమాధిన్
మునుఁగం దలంచె నొకపరి;
ననయము గాలంబు వుచ్చె ధ్యానైకరతిన్. ౨౭౦

కం. ఒక దివసంబున నాక
స్మికంబుగా ధ్యాననిష్ఠ మెలఁగ నరేంద్రుం
డు కనంబడెఁ దలవెనుకల
నొకానొకటి దివ్యమైన జ్యోతి ఘనంబై. —౨౨౧

కం. క్రమముగఁ బెదపెద్దై యా
క్రమించె నాసాంద్రకాంతిరాశి; నరేంద్రుం
డమనస్కుండై యద్దా
న మజ్జనోన్మజ్జనము లొనర్చుచు నుంకెన్ —౨౨౨

ఆ.వె. ఒక్కతూరి నవ్వు; నొకతూరి నవ్వు; వే
ఱొక్కతూరి వెక్కి వెక్కి యేడ్చు;
ఆ నరేంద్రుఁ, డిట్టు లాగూఢశాంతర
ములను బొందెఁ బెద్ద ప్రొద్దుదాఁక. —౨౨3

కం. అతఁ డొకదినమున "ధ్యాన
స్థితుండనైయున్న నన్ను స్పృశియింపు" మనన్
గుతుకమునఁ దోడిశిష్యుఁడు
కృతతత్కార్యుండుగాఁగ నేమందునికన్. —౨౨౪

మ. వడఁకెన్ వైద్యుతయంత్రమున్ గరమునన్
స్పర్శించినట్టుల్ గడు
న్గడు నాపాదశిఖంబుగా నొడలు; క
న్గమ్ముల్ పడెన్ మూఁత; ల

ప్పుడు బ్రాహ్మ్యస్మరణంబు మెల్ల మెలఁగఁ

బోయెన్; సహాధ్యాయ శి

ష్యుఁడు ప్రాపించి సమాధినిష్ఠను సము

ద్ద్యోతిల్లెఁ దత్తుల్యుఁడై. ౨౭౫

## ౧౦. రామకృష్ణ నిర్యాణము

కం. మొలకెత్తి రామకృష్ణుని

గళంబున వ్రణంబొకండు క్రమముగ గడ్డై

బలపడి, వాచి, కడుంగడు

నలోకసామాన్యమైన వ్యథ నిడుచుండెన్. ౨౭౬

ఆ. వె. తెఱువరాకనోరు, తినరాకయన్నంబు,

గుటకపడక కొలఁదిక్రోలునీరు

నిద్రలేకతండు నీరసించియు మానఁ

బోక శిష్యతతికి బోధసేయు. ౨౭౭

ఆ. వె. పలుకఁబోయియూఁగుఁ; బలుకుచు సగములో

మ్రింగిమ్రింగి బాధమీఱ మానుఁ;

గఱపవలయు దానిఁ గనుదోయిత్రోఁ, బెద్ద

మూల్గుఁద్రోడఁ, గఱపఁబూనెఁ దుదికి. ౨౭౮

మ. కనుసన్నంగొని రామకృష్ణుఁ దఱియం

గై మోడ్పుతో భక్తిమా

ర్గి నరేంద్రుండు; దదేకదృష్టిఁగనె నా

దివ్యర్షి చంద్రుండు; ఛా

త్రుని గాత్రంబున సూక్ష్మసూక్ష్మమగు నే
దోశ్శక్తి యీమాటకం
దని దొక్కెమ్మడిఁ జొచ్చె; వీడె నతఁడ
ద్దానన్ స్వబాహ్యస్మృతిన్. -౧౭౯

కం. ఆతఁ డలఁతితడవులకుఁ బ్రా
క్స్మృతిగొనె; దివ్యామృతంబు సేవించిన యు
ట్లతిమాత్రదర్శనీయ
ద్యుతితతిశోభం దదాస్యాంబుజ మలరెన్. -౧౮౦

మ. భగవానుండగు రామకృష్ణుఁ డాతనిన్
బాష్పాయమానాక్షుఁడై
తగ వీక్షించుచు నిట్లు పల్కెను; "సరేం
ద్రా! అమ్మ నాసంచితం
బగు నాధ్యాత్మికశక్తు లన్నిటిని నీ
కై ధారవోయించి రి
క్తుఁగఁ జేసె న్నను; యావదాస్తియును నీ
కున్ సంక్రమించెం జుమీ! -౧౮౧

కం. విను! విశ్వశ్రేయోర్థము
వినియోగింపంగవలయు వీనిని జగ
జ్జననీచిత్తము; తుదిదీ
వన యిదె" యని యుంచెఁ గేలు వానితలపయిన్. -౧౮౨

కం. కనుచున్న యానరేంద్రుని
కనులన్ నీర్దిరిగెఁ; బలుకఁగా మాటయు నో
టను రాదయ్యెను; ముడిఁగెను;
వినయంబున శిరసువాంచి విరచించె నతుల్. ౨౮౩

గీ. రెండునాళ్లకు రామకృష్ణుఁడు దనదు
నాత్మలోఁ బంచభూతంబు లానరేంద్రు
నాత్మమునఁ బంచభూతంబులందుఁ జేర్చి
నట్టు నెల్లరుగన నదృశ్యత్వ మొందె. ౨౮౪

కం. గురుదేవు నస్థిపాత్రను;
గురుదేవుని మూర్తి నట్లు గొనివచ్చి గుణో
త్తరుఁడు నరేంద్రుం డౌదల
ధరించి 'బేలూరు' నందు స్థాపనసేసెన్. ౨౮౫

కం. "గురుదేవుం డేగెను సూ
క్ష్మరూపమున లోకమెల్లఁ జరియింప జనో
ద్ధరణార్థం; బాతని స్థూ
లరూప మీయస్థిపాత్రలక్షణ మయ్యెన్." ౨౮౬

కం. అని సోదరశిష్యులఁ గని
"మనకిది పుణ్యస్థలంబు; మహీమండలికిన్
ఘనమైనజ్ఞానకేంద్రము;
జనింత్రు కోటానకోట్లు జగదాప్తు లిటన్." ౨౮౭

గీ. అనిపలికి తోడిశిష్యాళి యనుసరింపఁ
బూని సన్న్యాసమును మంత్రపూర్వకముగ
నామఠమునందు జపతపోధ్యాననిష్ఠ
లాచరించుచునుండె నత్యంతదీక్ష. ౨౮౮

కం. అదిలేదని యిదిలేదని
మదినిం జింతిలక యాసమయమునఁ దమకే
య్యదిదొరకిన నదికుడుచుచు
సుదీర్ఘకాలము తపస్సుఁ జొక్కిరి వారల్. ౨౮౯

చ. అనయముఁ గోడిగూఁతసమ
యంబున మేల్కని దివ్యనామకీ
ర్తన మొనరించి స్నాతులయి
ప్రాహ్ణమునందుఁ దపంబునందు వా
ర్మునిఁగెడివారు; ప్రొద్దుపొడు
పు న్నొకనాఁడును బ్రొద్దుగ్రుంకుట
న్నరయ; రొకొక్కప్పు డశ
నస్మృతి లేకయునుండి రత్తఱిన్. ౨౯౦

చ. అలఁదివిభూతి నాముఖప
దాంతము గాత్రమునందుఁ గావిచీ
రలుధరియించి కేల రుద
రాకలతోనశేషముల్ వహించి మో

ములఁ దగ బ్రహ్మతేజము స
ముజ్జ్వలతఁ దపమాచరించు వా
రలలశివావతారముల
రమ్యతఁబొల్చిరికన్నువిందులై. ౨౯౧

## ౧౧. పుణ్యక్షేత్ర సందర్శనము.

కం. క్షితి నాసేతుహిమాచల
గతపుణ్యక్షేత్రములను గనుఁగొని తత్ర
స్థితదివ్యర్షుల దర్శిం
చి తదనుగ్రహమునొంద స్థిరచిత్తుండై ౨౯౨

గీ. తొడరి గోధేనువును లేఁగదూడలట్లు
దన్ను వెంటాడు తన సహాధ్యాయగణము
నెట్టులెట్టులో! విడి యానరేంద్రుఁ డచట
భిక్షువృత్తినిఁగొని యాదిభిక్షువనఁగ. ౨౯౩

గీ. పృథివి సంసారసాగరద్వీపమైన
వారణాసినిఁగాంచి ప్రప్రథమమందు
మోక్షకాంక్షుల ముంగొంగు ముత్యమైన
విశ్వనాథునిఁ బెద్ద సేవించె భక్తి. ౨౯౪

సీ. రామరాజ్య "మయోధ్యఁ" బ్రాపించె; దివ్యంబు
"బృందావనంబు" దర్శించుకొనియె
వలఁగొనెఁ బుణ్య "గోవర్ధనశైలంబు;
జనియె "రాధాకుండమునకు"ఁ బ్రీతిఁ

ప్రఖ్యాతమగు "హరిద్వారంబునకుఁ బోయి ;
నిలఁ గీర్త్యమగు "హృషీకేశ"మరిగెఁ
బరమపావనమైన "వైద్యనాథము"ఁ జేరె ;
"బదరికావన"మందు బసనొనర్చి

గీ. రహినిఁ "గర్ణప్రయాగ" "రుద్రప్రయాగ"
"శ్రీనగర" మన్న క్షేత్ర మీక్షించుకొనుచు
'వివిదిషానంద' నామంబుఁ బేర్మిఁ దాల్చి
యానకేంద్రుండు 'హస్తిన' కరుగుదెంచె. ౨౯౫

మ. భగవద్దర్శన మాచరించుకొనుచున్
భక్త్యున్నతిన్ బుణ్యని
మ్నగలన్ స్నానమొనర్చుచున్ సలుపుచున్
నానాతపశ్చర్యలన్
దగ దివ్యానుభవంబుఁ బొందుకొను చా
క్రపాణి సంసేవయో
భగవత్సేవయకా మదిందలఁచుచుం
బైనించె దేశంబులన్. ౨౯౬

కం. నడచుచు నడచుచు నొకచోఁ
బడలి తరుచ్ఛాయ సతఁడు పండం జని యొ
క్రఁడు పీల్చుచున్న చిలుమును
నడిగెన్ ; వాఁడీక జరిగి యవ్వల కనియెన్. ౨౯౭

ఆ.వె. స్వామి ! అంటరానివాఁడను ; మీరలు
పుణ్యమూర్తులయిన భూసురులరు ;
కలుషమంటు నాదు చిలుముగొట్టము ముట్టఁ;
గడఁగిరేని నద్ది కడుగరాదు.” ౨౯౮

చ. అని పలుకన్ గ్రహింపకది
యాతఁడు గొంచెముదవ్వుపోయి నె
మ్మనమున “నీచరాచర స
మస్తమునన్ భగవత్స్వరూప మం
చనుకొని జాతిభేదముల
నంతముసేసియు సన్న్యసించియుం
గాన వెనుకాడితిం జిలుము
గొట్టమినీ! యతినన్న సిగ్గుగన్. ౨౯౯

గీ. తరతరంబులనుండి చిత్తమునయందుఁ
బాఁతుకొని వేఱుదన్నెను వాసనాళి;
ఏతదున్మూలనంబు నెన్నెన్నొతూర్లు
సలిపినను జాక వెండియు మొలకలెత్తె.” ౩౦౦

కం. అనితన్నుఁ దెగడికొంచును
వెనుకకు విచ్చేసి యీయవెనుకాడెదు మా
లని వేఁడి చిలుముగొట్టం
బును గైకొని కూరుచుండి పొగఁబీల్చ చనెన్. ౩౦౧

కం. చనుచుం జనుచు న్నొకపరిఁ
"దన కెది యీనాఁడయాచితముగ లభించుం
దినుదును హానిన"యని దీ
క్షనుగొని చనుచుండె నతఁడు గారడవిఁబడిన్. ౩౦౨

ఆ. వె. పెనమునోలె నేల బిట్టుఁగాలుచునుండె;
నిప్పుఁ జెఱుగుచుండె నిగిడి గాలి;
దారిడొంక లేని తావున నెట్టటో
దారిఁ జేసికొను చతండు నడచు. ౩౦౩

ఆ. వె. మండుచుండెఁ గడుపు; నెండుచుండెను గొంతు;
బొబ్బలెక్కె కాళ్లు పుండువాఱె;
నడుగుదీసి యడుగునిడఁజాలఁడయ్యెను;
నీడయేనిఁ దనకుఁ దోడు లేద. ౩౦౪

ఉ. అత్తఱి నాయతీశ్వరుఁడు
హత్తినబత్తిని రామకృష్ణునిం
జిత్తమునన్ స్మరించుచుఁ గృ
శించిన నాఁగకసాఁగె; వృద్ధుఁ డొ
క్కెత్తి యెవండొ? "ఆఁగుము న
రేంద్ర! నరేంద్ర!" యటంచుఁ బిల్చుచున్
నెత్తినిమూటఁ బోడ నత
నిం దటియుంజని పల్కె నివ్విధిన్. ౩౦౫

కం. "ఆఁకొన్నాఁడవు పాపము!
ఈకూటినిఁ గుడిచి, క్రోలి యీచన్నీటిన్,
జేకొనితగు విశ్రాంతిని
నేకడకేనియును బిదప నేఁగుము తండ్రీ!" ౩౦౬

కం. అని మాటనొసఁగి "నాకత
వినుతును బిస్మృటను; ముందు వేగఁగొనుము! భో
జన;మింతలోనవచ్చెద"
నని క్రమ్మఱ రాక యేఁగె నాతం డెటకో! ౩౦౭

కం. అమృతంబు నారగించిన
క్రమంబున నరేంద్రుఁ డప్పుడు గజబలుఁడై చి
త్తమునందు రామకృష్ణ మ
హీమంబుఁ గొండాడుకొంచు నేఁగెను బైకిన్. ౩౦౮

ఆ.వె. ఆఱవయిచి తీరమందుఁ గోపీనంబు
స్నానమాడ నొకట నది మునింగె;
లేచిచూచుసరికి లేదయ్యెనయ్యది;
యపహరించె దానిఁ గపియొకండు! ౩౦౯

కం. తలపాగా రచియించును;
వలెవాటుగఁ దాల్చు బుజముపైకి; మెడను దా
వళమట్లు వ్రేల్చుఁ; జుట్టును
మొల; కీయక యాతఁ డెంతమ్రొక్కుచునున్నన్. ౩౧౦

కం. కడ కతఁడు విసివి కానలఁ
బడి నిరశనవృత్తిఁబూని పయనమయి చనన్
నడిబాట నతనికంటం
బడె నాకాపీన; మెట్లువచ్చెనో? యటకున్. ౩౦౧

గీ. ఆతఁ డుత్తరదిశ నమ్మహాహిమాద్రి
యాత్రలుముగించి పొంది దివ్యానుభూతిఁ;
బూర్ణయాత్రనుగావింప బుద్ధిపొడమి
పయనమయ్యెను దక్షిణాపథమునకును. ౩౦౨

విగ్రహారాధనము (౧

ఆ.వె. నిగురుగప్పినట్టి నిప్పుచందంబునఁ,
బడగముడిఁచికొన్న పామువోలెఁ,
గావిపుట్టములను గట్టి క్రుమ్మఱె గుప్త
తేజుఁడతఁడు దేశదేశములను. ౩౦౩

గీ. సురఝురము పిచ్చుగుంటును దరిసినట్లు
జంగమంబైన తీర్థ మాస్వామి పూజ్య
పాదుఁడు నరేంద్రుఁ డరిగెఁ దత్ప్రభునిపుణ్య
భూతి నాళ్వారుసంస్థానమునకు నంత. ౩౦౪

గీ. ఆపురీవీథి విచ్చేయు నతనిఁగాంచి
బింబిసారుని పురరథ్య వెడలుచున్న
బుద్ధదేవుని స్మరియించి పూర్ణభక్తిఁ
బూజసేసిరి కరపద్మములను బ్రజలు. ౩౦౫

కం. కనుఁగొని మఠమొక్కం డం
దునికినఁగొనియుండ నొక్కరొక్కరె తద్ద
ర్శనమునఁ గృతార్థతంగొన
ననిశం బరుదెంచుచుండి రా యతికడకున్. 309

సీ. వ్యాఖ్యాన మొనరించు నరఁటిపండొల్చిన
ట్లుపనిషదరహస్యములు విప్పి;
పరవశుండయిచేయు భజనలు పాడుచుఁ
జైతన్యముఖభక్తజనుల పాట;
లతిలోకగతి నుపన్యసియించుఁ దా శ్రుతి
స్మృతిపురాణైకవాక్యతఘటించి;
గాలించిపైకెత్తుఁ గ్రైస్తవ మ్లేచ్ఛుల
సిద్ధాంతములలోని చేవయెల్ల;
గీ. రామకృష్ణునిమహిమ వర్ణనముసేయు;
సకలమతముల సామరస్యమును జాటు;
స్వానుభూతి నివేదించు నాయతీంద్రుఁ
డెల్లజను లుల్లమందు సముల్లసిల్ల. 310

కం. ఒకఁడేదైవము ప్రాప్యం;
బొక చేవర్ణంబు; జాతియొక టే; సర్వం
బొకటె; యని "నేహ నానా
స్తి కించన" యటన్న శ్రుతి నదికె నతఁ డెదకున్. 311

శా. ఆకారంబున మీనకేతనుఁడు, వి
ద్యారాశి వాగ్దేవి, ప్ర
జ్ఞాకౌశల్యమునందు గీష్పతి, సమం
చద్గీతరాగంబునన్
బైకాగ్రేసరుఁ; డాంగ్లవాక్చణులలోఁ
బ్రాచార్యవర్యుం; డెవం
డాకర్షింపఁబడండు వాని సదుప
న్యాసంబు నాలించినన్ ? ౩౧౯

సీ. మురళీధరుని గానమును విని ముగ్ధలై
వివశలై పఱతెంచు వ్రేఁతలట్లు
వత్సభూపతి ఘోషవతిహృద్యగీతికిఁ
జెవులూఁచు మదగజశ్రేణులట్లు
అలమహాశ్వేత వీణారావ మాలించి
క్రేళ్ళుదాఁటుచుఁ బాఱు లేళ్ళులట్లు
అహితుండికుని శ్రావ్యమైనట్టి నాగస్వ
రమునఁ బైకుఱుకు సర్పంబులట్లు
గీ. వరనరేంద్రుని ధార్మికప్రవచనంపు
వార్త నాత్మక్రియాకలాపములు మఱచి
జనులు తండోపతండముల్ వెనుదిరుగక
యెండనక వాననాక, వత్తెఱ్ఱిల్లతఱుల ౩౨౦

గీ. ఇక్షుఖండంబు ముసిరెడు నీఁగలట్లు
సురభికుసుమంబు మూఁగు బంభరములట్లు
ఆ మహాత్మునిఁ జుట్టి యహర్దివంబుఁ
గ్రోలుచుండిరి వాని వాక్సుధలు జనులు. 3-20

శా. ఆయాళ్వారు ధరాధినాథుని యమా
త్యాగ్యుండు దివ్యర్ధి దే
శీయుల్ స్వామిని విన్న స్వప్రభుని నా
స్తిక్యంబు నిర్మూలమై
శ్రేయంబొందునటంచు నెంచి, కొని తె
చ్చెన్ స్వామి దర్శింపఁగా
నా యుర్వీపతి వచ్చి జోతలిడి
మర్యాదన్ విడంబించుచున్. 3-21

కం. "మీరలు లెస్సగఁ జదివిన
వారఁట; మీచేయరాని పనియుండద; యీ
తీరునను నీచమూచనఁ
బ్రారంభించితిరి గౌరవంబడుగంటన్ 3-23

గీ. కావు గ్రుడ్డివి; కుంటివిగావు నీవు;
మల్లమర్త్యాండునట్లుండి మాన ముజ్జ
గించి క్షుమ్మలుదని యేవగించుకొనరె ?
కాయకష్టంబుచే బ్రదుకంగరాదె ? 3-24

గీ. ఈయమాయికలోకంబు నిట్లుగాని
మోసపుచ్చంగ రాదంచుఁ బూనుచుంద్రు
పలువు రాషాఢభూతులు; వారివంటి
వార లొకవేళఁ గాకపోవచ్చు మీరు." 3. ౧౫

ఆ.వె. అనుచుఁ గురుడువాడినట్టి నిర్లక్ష్యభా
వమునఁ దన్నె దిద్దిపలుక నెవఁడు
సాహసించునంచు సరవి దేవానాంప్రి
యుండు నలికెఁ గొదుకకుండ లవము. 3_౧౬

మ. యతి యాలించి తదీయవాక్య మనె "రా
జా! ముందువాక్రువ్వు; మా
తతమోహంబున రాజ్యనిర్వహణతం
ద్రాళుండవై భోగినీ
తతిఁ ద్రాగుచు నాడు చెందుకుఁ బ్రజా
ద్రవ్యంబు వెచ్చింతువో ?
మతిమంతుండవు; కాయకష్టమున సం
పాదించితే యీసిరిన్ ? 3_౧౭

కం. అని వెనుకాడక పలుకఁగఁ
జనులందఱు చూచి స్వామిసాహసమును ద
మ్మును గోపగించునో ఱేఁ
డనుకొని చేష్టుడిగియుండ యతి కాతఁ డనెన్. 3_౧౮

కం. "నాయిష్టంబది; పరులు మ
దీయచరిత్రంబుఁగూర్చి యేలతడవ? నా
శ్రేయస్కరమెదో! యెఱుఁగుదు"
నా యతియనె నాజవాబు నదియే నీకున్ ౩౨౯

మ. నినుయాచింపఁగరాను; నీవలనఁ గా
నిన్నేనిఁగైకోను బో!
తృణముల్ మేరునగరంబు నాకు నౌకరీ
తిందోఁచు; సన్న్యాసి; ధా
త్రి నినుంబోలిన మత్తచిత్తులకు బో
ధింపంగ నుర్వ్యాజ్ఞఁగై
కొని సంచారమొనర్తుఁ; గాయసుఖముల్
కోరంజుమీ! నీవలెన్ ౩౩౦

ఆ.వె. అత్తచేయుదాని కారళ్లులేవు; పా
తకములేదు పెద్దతలలకండ్రు;
నిన్నుదర్చి పలుకనేరమి నీప్రజ
సాఁగుచుండె నీదు నాగడంబు. ౩౩౧

కం. ఓయీ! రంధ్రాన్వేషము
సేయకు; మేపుట్ట నెట్టిచిలువగలదో? క
ట్టా! యదిబుస్సని లేచిన
దూయంగావలయుఁ గాలు దుందుడుకుమెయిన్." ౩౩౨

కం. అని కోపంబును హాస్యం
బును సమముగ మేళవించి బుధవరుఁ డాడన్
జనపతి ముడింగి తెలివిగ
క్షణమూరకయుండి తత్ప్రసంగముమార్చెన్. 333

గీ. "స్వామిజీ! కాదెమార్గ మ్యంబు? ప్రాణశూన్య
విగ్రహంబులఁ బూజఁగావించుక్రమము;
క్రైస్తవమహమ్మదీయు లీకరణి విగ్ర
హప్రతిష్ఠార్చనములు సేయర నిజంబు. 334

శా. ఓతప్రోతముగా జగంబలమి తా
నొప్పార నీశుండిలన్
రాతిన్ రప్పను గట్టెఁగట్టను సమా
రాధించు నేలా? జన
వ్రాతం బెట్టులు? మ్రొక్కఁ బుణ్యసతి వి
శ్వస్తం, దనుం బోలుచుం
బ్రాఁతిన్ వర్ధిల్లుమన్నరీతి ఫలలా
భంబౌఁగదా! వారికిన్. 335

గీ. అనవుడు నరేంద్రుఁ "డితనికి నాణెఁదాకు
బోధఁగావింతు" ననుకొని ముందుసూచి
గోడపయి వ్రేలుచున్న యాక్షోణినాథు
చిత్రపటమునుదెప్పించి చేతఁదాల్చి. 336

గీ. సేవకులఁబిల్చి "మీరు నిష్ఠీవనంబు
సేయుఁడీ కాగితపుబొమ్మఁ; జేయ కిట్టు
లొండొరులమోములను జూచుచుంటి రేల?
కొదుకుకొంద్రేల? మదినేల గొణుగుకొంద్రు? ౩౩౮

గీ. దీననున్నాఁడు మీధరాధీశ్వరుఁడని
తటపటాయించుచుంటి; రాధరణివిభుని
స్వస్వరూపంబుగాదిది; ప్రాణహీన ;
మిందు నుమియంగఁ బిర్వీకదేల మీకు? ౩౩౯

చ. అనవెఱఁగంది పెగ్గడ "మ
హాత్మ్య నరేంద్రునిఁ దన్ను ఱేఁడః ము
న్వెనుకలుసూడ కల్క-మొయి
బెట్టిదముల్ పలుకాడునేమొ! దు
ర్వినయమొనర్చునేమొ!" యని
భీతివడంకు "చిదేమి! స్వామి! మా
జనపతిపూజ్యచిత్రమును
జన్నిపొనర్పగదూష్య మీక్రియన్ ?

కం. "నావిష్ణుః పృథివీపతి"
నా వినుచున్నాము; భూమినాథుని చిత్రం
బావిష్ణుచిత్రమేకద!
దేవర! పాపక్రియోపదేశ ముచితమే?" ౩౪౦

మ. పలుకంగానిటు లాయమీంద్రుఁ డనియెన్
"ద్వద్రాజచిత్రం బిటన్
మలినీభూత మొనర్ప మైలవడునే
త్మాత్మ జాని? దూషించు మి
మ్మలుకంజూచునె? చంపవచ్చునె? త్వదీ
యస్తోత్రముల్ కాని పూ
జలుగానీ కొని సంతసంపడిన యా
చందంబు మున్గంటిరే? 381

ఆ.వె. రాతివిగ్రహమునఁ బ్రాణంబు లేనట్లు
చిత్రమునకు లేదు జీవితంబు;
అయిన మీరు దానినర్చింత్రు భక్తిప్ర
పత్తులలర"నంచుఁ బ్రభువుఁగాంచి. 382

శా. "రాజా! చూడుము! నీదు సేవకులు చి
త్రంబున్ విలోకించి నిన్
బూజల్ సేసినయట్లె చేయుదు; రొక
ప్డున్ దానినిర్జీవపున్
నైజంబెన్నరు; దా ని కెట్టియవమా
నంబున్ సహింపంగఁబోఁ;
రూపై నంబడనీక కాతు రనయం
బుం ద్వత్పరోక్షంబునన్. 383

గీ. విగ్రహంబులఁ బూజఁగావించువార
లీశ్వరుప్రతీకమని దాని నెంచుకొంద్రు
దానికర్పించునర్చలు "దైవతంబు
స్వీకరించును"యని విశ్వసించుచుంద్రు ౩౪౪

కం. ఓతప్రోతముగ సమా
మ్నాతుండగు నీశ్వరుండు నానాప్రతిమా
వ్రాతమున నేలయుండం ?
డాతనియుపాసనమె విగ్రహారాధనన్. ౩౪౫

కం. ఏరూపముతోడ నలం
కారంబులుగానఁబడ్డఁ గాంచన మొకటే !
ఏరూపునఁ దోఁచిన వే
ల్పేయయి యీశ్వరుండొకండె విగ్రహములలోన్. ౩౪౬

కం. "ఎవరేగతి భావించిన
నవుదును బ్రాప్యముగ వారికారూపముతో
భువి"నంచును భగవంతుం
డు వచించెనుగీత నర్జునున కిదివినరో ! ౩౪౭

కం. ప్రవచింపఁగ నివ్విధమున
నవనీనాథుఁడు గరద్వయము మోడిచి "నా
యవివేకము మన్నింపుము !
తవిలితిఁ బాశ్చాత్యమోహతంతువులందున్. ౩౪౮

కం. జనుషాంధుఁడనగు నాదగు
కనుఁగవఁ దెఱచితివి; స్వామి ! కాకుండిన నే
మునిఁగెడివాఁడను బాపా
బ్ధిని; నీ యీ ఋణము నెట్లుదీర్చఁగల నిఁకన్ ? ౩౪౯

కం. అని చరణంబుల వ్రాలఁగఁ
దనదర్పముకరఁగి, యతియుఁ దలఁగేలిడి యా
జనపతితో “ మన్నించును
నిను భగవంతుం డు సాంతనిం గొలువు” మనెన్. ౩౫౦

టారీఘాట్ స్టేషను ౨.

కం. కానీ లేకయుఁ గరమున
నానాయాత్రలనతం డొనర్చు చోకతతన్
బూనికిని రాజపుత్ర
స్థానమునఁ బ్రయాణకంబు సలుపుచునుండెన్. ౩౫౧

కం. మలమలమాడ్చుచుఁ బెనుమం
గలముకరణి నేలనెల్లఁ, గడు వేఁచుచుఁ బ్రా
ణులఁ బేలగంజలను వలెఁ
జెలరేఁగె నిదాఘమంతఁ జెరగుచు నిప్పుల్. ౩౫౨

కం. వడఁదాకి యెండిగొంతులు
పుడమింబడెఁ బెక్కుజంతువులు గనుఁగొని న
ల్గడల మరీచికలను జల
తడాగములటంచు భ్రమసి తటియఁబఱచుచున్. ౩౫౩

కం. సురగాలి దుమారంబును
గరమరుదుగ రేఁపి నాసికాకర్ణములం
జొరఁగా నుక్కిరి బిక్కిరి
పఱచుచుఁ గలఁచెం బ్రయాణపరులను రథ్యన్. ౩౫౪

సీ. అట్టి వేసంగి మట్టమధ్యాహ్నమందు
స్వామి పయనించు చొకనాఁడు ధూమశకటి
'టారిఘాట్టున' డిగి నిరాహారుఁడగుట
డీలువడియుండెఁ గాల్ద్రియఁజాలకుండె. ౩౫౫

సీ. పంచపాత్రెఁడునీ ర్విక్రయించుచుండి
రొకయణా వెల; కాస్వామినికటమందు
నెఱ్ఱనేగాని లేద; నోరెండుచుండె
నుస్సురనుకొంచు నందాతఁ డూరిగెనేల. ౩౫౬

సీ. వచ్చి యమకింకరునిఁబోని భటుఁ డొకండు
'వలదుపండంగనిటు' నంచు వెలలనడఁచె
సదనముంగాచు నీచంపుశ్వాన మదియె
దొరనటంచును దర్పంబుతో మొఱుంగు. ౩౫౭

సీ. విస్ఫులింగంబులట్టులు బెట్టిదముగ
మండుచుండినరాళ్లతో నిండియున్న
బయలునం గూరుచుండె నాభవ్యతముఁడు
పండునిప్పులకొలిమిఁ గూర్చుండినట్లు ౩౫౮

గీ. స్వామిసామీప్యమునఁ దరుచ్ఛాయయందుఁ
బురుషుఁ డొకరుండు గూర్చుండి మూటవిప్పి
భోజ్యములనారగించు చంబువులఁ గ్రోలి
త్రేన్చుకొంచును స్వామిజీదెసకుఁ జూచి ౩౫౯

గీ. "తిండియుం దీర్థమును లేక యెండియెండి
యిగిరిచచ్చెడు కాంబోలు! నీయతులకుఁ
బ్రాప్యమగు మోక్షమం"చు నప్రాజ్ఞతముఁడు
కృపణుఁ డొనరించె బిట్టవహేళనంబు. ౩౬౦

గీ. క్షుత్పిపాసార్తికిం దోడు క్షుద్రభటుని
ఘూర్తవర్తన, దానికిం దోడు మెండు
మండుభువి, వీని లెక్కింపకుండు నాతఁ
డీ యధమువహేళనంబు లక్ష్యించునొక్కొ? ౩౬౧

ఆ.వె. "నడుమువంచి కష్టపడి కూలిసేసినఁ
గడుపునిండఁగూడుఁ గుడుతువుగద!
జోగివేసమూని సోమరిపోతవై
తిండిలేక చచ్చుచుండ నేల?" ౩౬౨

కం. అని మరియుఁ దెగడఁగా దూ
షణభూషణధిక్క్రియావిజయిగావృట నా
ఘనుఁ డూరకుండె వినుచున్;
శునకము మొఱుఁగంగ నేన్గు క్షోభిల్లు నొకో! ౩౬౩

మ. అలభక్ష్యంబులు, భోజ్యచోష్యములు, లే
హ్యాంబుల్ కడుం బేయముల్
గలపళ్యంబు శిరంబునందునిచి యొ
క్కండెవ్వండో? యెల్లది
క్కులు వీక్షించుచు వచ్చి స్వామికడకున్
గుర్తించి పెన్బత్తి సాఁ
గిలి చిత్రాసనమున్ భువింబఱచి ని
క్షేపించి యాపళ్లెమున్. ౩౬౪

ఉ. "స్వామి యనుగ్రహించి నను,
సాపడుఁ"డంచును దోసిలొగ్గఁగా
నామహానీయుఁ డద్భుతము
నందుచు "భద్ర! యెవండవీవు? ని
న్నే మునుజూచియుండ; నను
నెవ్వరిగా భ్రమియించినావొ? యీ
గ్రామము కేనుగ్రొత్తనుమి!
కావునఁ బొ"మ్మన నాతఁ డిట్లనెన్.

శా. "దేవా! నేను మిఠాయివర్తకుఁడ; రా
త్రిన్ నాకుస్వప్నంబులో
దేవోత్తంసుఁడు రామచంద్రుఁడు దయో
త్సేకుండు ప్రత్యక్షుఁడై

ఏవంరూపుని నిన్నుఁగన్పఱచి "నా
యీభక్తునిఁ దృప్తిపా
సానైవశ్య భుజింపఁజేయు"మని యా
జ్ఞాపించిపోయెఁ నను౯ 366.

కం. కల కల్లగదా! యనుకొని
చలింపక శయింప మరల స్వప్నమువచ్చెఁ
దొలివలెనె; బద్దకించితి
మెలఁకువగొని; యెవఁడో? కేల మెయిఁదట్టె నను౯ 367

గీ. భగవదాదేశమియ్యది వాస్తవముగ
దాఁటరాదంచుఁ గైమోడ్చి తానమాడి
దాల్చిధౌతంబు వండి పదార్థములను
దెచ్చితి; భుజించి ననుఁబ్రసాదింపుఁడయ్య! 368

గీ. అనుచు బ్రతిమాలఁగా స్వామి యాలకించి
రామచంద్రుని దివ్యదర్శనముకలిమి
ధన్యుఁడగు వానినిం దాఁకి తలఁచి తన్ను
ధన్యునిగ నారగించెఁ బదార్థమెల్ల. 369

ఆ.వె. అవిరతంబుఁదన్ననన్యభక్తినిఁగొల్చు
భక్తకోటి కొంగుఁబసిఁడియగుచు
నేడుగడయునగుచు నెపుడు యోగక్షేమ
మరయుచుండు దైవ మనఁగవినమె? 370

కం. ఈదృశ్యంబును గాంచుచు
నాదిక్కున నిలిచియున్న యామూర్ఖుఁ డెదం
బ్రాదుర్భూతవివేకుం
డై "దోసముసైఁపు"మని తదంఘ్రుల వ్రాలెన్. 321

## క్షేత్రీనగరము. 3

ఆ.వె. యాత్రసేయుచాతఁ డాదేశమందున్న
క్షేత్రినగరమున వసించెఁ; బ్రజలు
దినదినంబుఁ దదుపదేశార్థమరుదెంత్రు
పండ్లగంపకడకుఁ బఱచునట్లు 322

గీ. కంచుగీసినగతి వానిగళము మ్రోఁగు;
నన్ని వేళల శ్రోత్రపేయముగఁ బాడు
చిలను బుంభావభారతి యాత డనఁగ
సంతతము ధర్మబోధలు సలుపుచుండు. 323

ఆ.వె. మంత్రబద్ధులట్లు మాటాడ రెవ్వరుఁ
గదలిపోరు; వానికడ నెయుందు;
రిద్ది నిద్రవేళ, యిద్ది భోజనవేళ,
యిద్ది స్నానవేళయేని ననక. 324

ఆ.వె. అరుగుదెంచువారియం దొక్కరుండేని
స్వామిభిక్షుఁగూర్చి పలుకఁడయ్యెఁ;
జద్దితిన్నపడఁతి స్వపతియాఁకలిగూర్చి
యెఱుఁగఁదన్నమాట సరిపడంగ. 325

సీ. చర్మకరుఁడొక్కఁ డీరహస్యం బెఱింగి
స్వామిదర్శించి తనజాతి స్పష్టపఱచి
"వంటఁజేయింతు బ్రాహ్మణప్రవరుచేత
భిక్షఁగైకొండు! నాకుఁదృప్తిగ" నటంచు ౭౬

మ. బ్రతిమాలంగ యతీశ్వరుండనియె "స
ర్వంఖల్విదంబ్రహ్మ"యన్
శ్రుతి బోధించు "చితండుపంచముఁడు; వి
ప్రుండీతఁ" డన్ భేదమున్
మతిఁబాటింతునె? నీవ వండికొని తె
మ్మా! శంకలందక్క"యం
చతఁడర్పించిన మైలకూడుదినె; బ్ర
హ్మజ్ఞుం డమూదృత్తుఁడే! ౩౭౭

కం. ఎఱుఁగంగవచ్చె క్షేత్రీ
పురపతి కాస్వామిఁగూర్చి; పోయియతని నా
దరపూర్వంబుగ వేలుపుఁ
గరణిం దోడ్తెచ్చి పూజఁగావించెఁ గడున్. ౩౭౮

ఆ.వె. అడుగులొత్తె; నుదికియాఱవైచెను శాటి;
స్వయముమోసి తెచ్చి పఱచెఁబాన్పు;
మహితభక్తిఁ దక్క–మండలువుం దోమెఁ;
దొడిగెఁబాదుకలను బుడమితేఁడు. ౩౭౯

ఆ.వె. భర్తమించిభార్య; భార్యను దా మించి
భర్త స్వామిఁ గట్టి భక్తిఁ దోడ
నహరహంబుగొలుచు చాతని యుపదేశ
మమృతరసమునట్టు లానుకొనిరి. ३५०

ఆ.వె. స్వామి మెచ్చి వారిభక్తికి నారాజు
వాంఛితంబెఱింగి పాణిపద్మ
మతనిసిరసుపైని నాన్చి "పుత్రోదయ
ప్రాప్తిర" స్తటంచు వరమొసంగె. ३५१

గీ. "వివిదిషానందుఁ"డామహీవిభుని ప్రార్థ
నముచఁ దా 'వివేకానంద" నామమొందె;
నామరూపంబులప్రధానంబులైనఁ
గోవిదులు భక్తహృత్ప్రీతిఁ గూర్తురిట్లు. ३५२

కం. చనుచుండ నొక్కపరిఁ గా
ననమునఁ బులియొక్కఁ డాయనకు నెదురయ్యెన్
అనుకొనెనొ ? "వచ్చెఁబుట్ట"ని
చనియెం బెడదారి నతనిచక్కిం గనుచున్. ३५३

ఆ.వె. "శివునియాజ్ఞ లేక చీమయినఁగుట్టద"
టన్నసూక్తి సత్యమక్షరాల;
నరునిఁగాంచి మీఁది కురుకక వ్యాఘ్రంబు
పరుగువాఱెనన్న నరిదియొక్కొ ? ३५४

ఆ.వె. జయపురంబు, నాబుశైల, లిమ్డీ, భూజ
నగరపుణ్యపత్తన, మహిసూర,
కొచ్చిదేశములను గోర్కెమైఁగనుచు రా
మేశ్వరమున కాతఁ డేఁగెఁ బిదప. ౩౮౫

దక్షిణయాత్రలు ౪.

మ. తొలిజన్మంబులపాపముల్ కడుగు సే
తుస్నానముంజేసి, బి
ట్టెలమిన్ సైకతలింగదైవతము, రా
మేశాఖ్య, మాజానకీ
లలనాప్రాణపతిప్రతిష్ఠిత, మన
ల్పంబైనభక్తిన్ సమ
ర్చలుగావించి యతీశ్వరోత్తముఁ డెదం
బ్రాపించెఁ బెన్ హర్షమున్ ౩౮౬

ఆ.వె. కడలికరుడులీఁది 'కన్యాకుమార్యగ్ర'
మునకు నచటు గదలిపోయె నతఁడు;
సరవి దుస్తరంపు సంసారసాగరం
బీఁదినట్టిఁ డేది యీఁదలేఁడు? ౩౮౭

ఆ.వె. ఆతఁ డమ్మవారి నర్చించి యచ్చటి
జలధితీరగండశిల వసించి
తనకు దారినడుమ ననుభూతమగు లోక
వృత్తమును స్మరించి యిట్లనుకొనె. ౩౮౮

చ. చిలుకలవోలె శాస్త్రము వ
చ్చినపల్కులె యెల్లకాలముం
బలుకుచు స్వానుభూతి యణు
మాత్రముఁగానక తారు పట్టుకుం
దెలునకు మూఁడుకాళ్ళని ప
దిం బదిగా- బిడివాదమాడు మూ
ర్ఖులగు మఠాధికారులఁట!
రోఁతగదా! మతధర్మరక్షకుల్. ౩౮౯

మ. అడుగంటెన్ మనభారతీయమగు వి
ద్యల్; పుచ్చిపోయెన్ గడు
న్గడుధర్మంబును; వేషభాషణములున్
బాశ్చాత్యలోకంపుఁ బో
కడలన్ మైలపడెన్; సమస్తజనల
క్ష్యం బద్ధకామంబులై
పెడదారింబడె; బూతిగంధియయి యీ
విశ్వం బిసీ! కన్పడున్. ౩౯౦

మ. తినఁగామూఁగుచు నెంగిలాకులపయిన్,
దీర్ఘంగఁ బెన్దప్పినిం
జనుచున్ సీ! గవులూఁఋగుంటలకు, వృ
క్షచ్ఛాయలంబందు చెం

డను వానర్, మెయిఁజింకిపాఁతలను మహా
నంబెట్లో! రక్షించుకొం
చును జీవించెడిపేదలం గనఁగఁ జిం
చుందుఃఖ మీఁకెందముర్. ౩౯-౧

గీ. సప్తభూమికమైన ప్రాసాదములును,
బంచభక్ష్యాన్నములు, జిల్గువలువపిండుఁ,
గడిఁదిసిదిసంపదలుగల్గి యుడరువార
లెఱుఁగఁబోవర వీరు సోదరులటంచు. ౩౯-౨

సీ. ముక్కారుఁబండుభూములు పచ్చగడ్డియు
మొలవని చవిటిపఱ్ఱలుగ మాఱెఁ;
ప్రాణికోటులకు జీవనమిచ్చుచునుండు
వారిదశ్రేణులు వట్టిపోయె;
బండ్లకొలంది నెప్పట్లఁబండులనీను
చెట్లమొత్తంబుల చేవదగ్గెఁ;
బిదికినఁగడవల పెచ్చుగాఁబాలిచ్చు
నెల్లయావులపొదుంగు లెండిపోయె;

గీ. నోషధులశక్తియుడుగంటె నూచముట్టు;
దీసె విజ్ఞానవాహిని తేమమిగుల;
నానవాలునుగాన్పింప కాఱిపోయె
బొత్తిగా దేహబలరేఖ భూజనులకు ౩౯-౩

సీ. అక్షరాస్యులు నూట దశాంశముండి;
రుండె వేయింట మెట్రియు యొక్కఁడుమాత్ర;
గలఁడు గండరగండఁ డొకండు కోటి;
భరతఖండంబు క్షయరోగిపగిది నుండె. ౩౯౪

మ. ఘనశిల్పంబులఁ, దత్త్వశాస్త్రమున, సం
ఖ్యాశాస్త్రమందున్, రసా
యనతంత్రంబున భూఖగోళముల, వై
ద్యంబందు, నిట్లన్నిటన్
గనె లోకోన్నతి భారతంబు మును; లో
కాలోకముల్ దాటిపో
యెను దత్కీర్తి; యదృష్టరేఖ యిపు డీ
స్సీ! మాసిపోయెం గదా! ౩౯౫

సీ. తమకు సేవకు వలసినంతగనె యలఁతి
యలఁతివిద్యల నేర్పింతు రాంగ్లవిభులు;
"మాటలకుఁగన్నతల్లియు మాఱుదల్లి
పెట్టున" కటన్నగతిఁ గానిపింత్రు వారు. ౩౯౬

శా. చాలుల్ మూలయు లేని
సాంఘికదురాచారంబులే యయ్యోఁబో
మేలుంబంతులు జాతిక భరతభూ
మిం; దత్పురోవృద్ధికిన్

ఆలోచింపఁగ వేరుపురుష్వులు మతా
ధ్యక్షుల్ ; పురోధోగణం
బేలా ! పెక్కులు ? దయ్యముల్ కరణి నెం
తేఁ బట్టి పల్లార్చెడిన్. ౩౯౬

గీ. నఖశిఖాంతంబు మార్చె హైందవు నెల్లఁ
బ్రాఁకి పాశ్చాత్యసభ్యత వ్యాధివోలెఁ ;
బారమార్థికదృష్టి కోల్పడెను; దానఁ
స్వార్థచింత విశేషించె నవధిఁగడచి ౩౯౭

గీ. స్వస్వరూపంబు మఱచిరి భారతీయు
లకట ! యాత్మస్వరూప మన్వర్థమంచుఁ
దృష్టులయిరి పాశ్చాత్యు లీయిరువురికిని
గనులు దెఱపింపవలెఁ గలికమును వేసి ౩౯౮

కం. అన్నట్లు స్మృతికివచ్చెను ;
మొన్న "అమెరికా"ఖ్య దేశమునను "షికాగో"
యన్నగరిఁ బ్రపంచమతస
భన్నడిపింతురని వింటిఁ బత్రికవల్లన్. ౪౦౦

మ. అదిగో ! సాగరుఁ డూర్మిహస్తముల
నాహ్వానించుచుండెం బ్రతీ
చ్యదిశాయాత్రకు నన్ను ; విశ్వమతస
భ్యశ్రేణిలో రామకృ

ష్ణుదయన్ భారతధర్మదుందుభి నభి
ష్టుత్యంబు మ్రోగించి ప్రతి
ష్ఠము నానాఁటికి నార్షసంస్కృతికిఁ ను
ద్బోధించి పాషండులన్. ౨౦౧

గీ. చిల్లిగవ్వేనియును నాదు చెంత లేద;
అమెరికా దేశమున కెట్టు లరుగఁగలను?
బిలిచె రత్నాకరుఁడు నన్ను వెఱప దేల?
కలదు నా తల్లియగు రత్నగర్భ మరియు." ౨౦౨

గీ. అనుకొని ముగించుకొని తీర్థయాత్ర నంతఁ
జెన్నపత్తనమునకుఁ విచ్చేసె నతఁడు;
తరణి దర్శనమునకయి తమ్ములట్లు
తనుఁ బ్రతీక్షించు ప్రజల సంతసము పఱుప. ౨౦౩

గీ. అపరశంకరుఁడని పండితాళి పలికెఁ;
బామరగణంబు "పైల్వానుస్వామి" యనియె;
యౌవతము "మన్మథస్వామి" యనుచుఁ బొగడె;
వాని విద్యాబలాంగసంపదలు గాంచి. ౨౦౪

కం. అమృతంపుజల్లు పగిదిని,
హిమాంబుపూరంబు కరణి, నేతదుపన్యా
సము కంఠమాధురియు, వా
క్చమత్కృతియుఁ గలిగి తద్ద శ్లాఘ్యంబయ్యెన్. ౨౦౫

కం. "తెలిసియుఁ దెలియ కహర్నిశ
ముల సలుపు సమస్తపాపములఁ దొలఁగింపన్
దలపుము! రేపును మాపును
నలసతఁ గ్రమముం ద్యజింప కోపరమేశున్. ౪౦౬

కం. కొనిపోవుఁ బ్రాచ్యసభ్యత;
జనుధర్మాశ్రయత నీశసన్నిధి; కనుపున్
వెనుకకుఁ బ్రతీచ్యసభ్యత
ఘనార్థకామైకబద్ధ గావుట సతమున్. ౪౦౭

గీ. శ్రీపరాత్పరుసాక్షాత్కరించుకొనఁగఁ
దివిరి దగ్గఱిదారినిఁ దెలుపునట్టి
మతమె యత్యుత్తమంబైనమతము సుమ్ము!
అనుసరింపుము! తద్ధర్మమును గ్రహించి. ౪౦౮

గీ. కడుపుఁ జంకకుఁ దగిలించి పుడమినాల్గు
చెఱఁగులందు యథేచ్ఛఁ గ్రుమ్మఱుము; కాని
వేషభాషాప్రవర్తనల్ వీడకోయి!
వీడెదే మానవత్వంబె వీడు నిన్ను. ౪౦౯

గీ. జ్ఞానముంబట్టి యుచ్చనీచతలు గలుగుఁ
గాని కేవలజాతిచేఁ గాదు! కాదు!
కాన గర్వోన్నతంబు నీదైన చూపుఁ
గ్రిందికిం దింపి సామాన్యవృత్తి మనుము! ౪౧౦

కం. "చిలుకుఁడు సంస్కృతవిద్యా
జలధి; ననర్ఘ్యమగురత్నజాలము దానం
గలదుచుఁడి! దేవభాషను
వెలివెట్ట దరిద్రుఁడగును విజ్ఞానమునన్. ౪౧౧

ఆ.వె. ప్రకృతిశాస్త్రములను బఠియించి నాస్తిక
వాదులై మెలంగవలదు! వలదు!
ప్రకృతిశాస్త్రములను భారతీయులతత్త్వ
శాస్త్రములను జతగఁజదువ మేలు! ౪౧౨

కం. నిరతంబు సాముసేయుఁడు !
శరీర మాద్యమగుధర్మసాధనముగదా!
మెఱుఁగిడుకొను నన్యోన్యము
శరీరబలమును ధరిత్రి జ్ఞానబలంబున్. ౪౧౩

కం. పరదేశ్యులు వ్రాసిన మన
చరితలు కల్లలకరుళ్ళు; స్వమహిమత, స్వే
తరుల లఘిష్ఠత వారికి
గుఱి; భారతబుధులె వ్రాసికొనవలె నింకన్. ౪౧౪

కం. తొలి గూడుగుడ్డలిడి బీ
దల సాదుల మనుపవలయుఁ; దదుపరిఁ గఱపన్
వలె విద్యయు; మానవసే
వలె మాధవసేవలంచు భావింపుఁ డెదన్. ౪౧౫

గీ. "భూతదయ" "భూతదయ" యనుచుఁ బ్రేలఁబలుకఁ
బోవకుఁడు! భూతదయగాదు భూతసేవ
సకలభూతంబు లీశ్వరాంశములుగాన;
భూతదయ నా నహంయుతాస్ఫూర్తిదోఁచు." ౮. ౬

గీ. అనుచుఁ బ్రత్యుత్తరించె నాయమాయి ప్రాజ్ఞ
సంచయప్రశ్నములకెల్ల స్వామి సభల
విచ్చ సంశయములు మంచువిచ్చినట్లు;
తేజరిల్లెను జిత్తముల్ దెసలువోలె. ౮౧౭

గీ. స్వామిసంకల్పముఁ గ్రహించి సభ్యులెల్ల
నాయనప్రపంచమతసభాయాత్రకైన
వ్యయమునకు నైదునూర్లగూప్యంబులొసఁగఁ
గైకొనఁడయ్యె గుర్వాజ్ఞగామి నపుడు ౮౧౮

గీ. పశ్చిమాద్రికిఁ జను నాత్మబాంధవుఁగని
ముదుఁగుతమ్ములచందాన మోడ్పుఁగేలు
పరగఁ బౌరులు హైదరాబాదుకరుగు
స్వామివరు సాఁగనంపిరి భక్తిమెరయ. ౮౧౯

గీ. హైదరాబాద్ నవాబు నాహ్వానమంది
పోయి దర్శించి యూతని ముగ్ధుఁ జేసె;
జదువులసరస్వతియకదా! సందియంబె?
అతని ప్రాగల్భ్యముంగాంచి యబ్బపడఁగ. ౮. ౨౦

గీ. వ్యాసుఁడో! వసిష్ఠుఁడో? యీమహామహుండు
ఆంగ్లవిద్యాచణుండయి యవతరించె
'శకపురుషుఁ'డన్నఁజెల్లు నీస్వామి యంచుఁ
దదుపదేశంబువిని ప్రజల్ తలఁచుకొనిరి. ౪-౨౧

ఉ. కానుకలిచ్చి ధన్యతను
గాంచ నవాబుదలంచి పంపనా
హ్వానము నిస్పృహుండగుట
నాయన వానిఁదిరస్కరించె; నా
పైని 'నిజా'మిఁకెట్లులని
"పశ్చిమఖండపుయాత్రకై వ్యయం
బేనిభరింతు" నన్న నద
నియ్యదిగాదని యిచ్చె దీవనల్. ౪-౨౨

కం. 'ఇసలాము' మతముఁగూఱించి
నసిగ ముసల్మానుబుధుల సంప్రశ్నింపన్
అసమర్థులయిరి వారలు
సుసంగతంబగుజవాబుఁ జూచి వచింపన్. ౪-౨౩

గీ. తనదు పశ్చిమఖండయాత్రనుగుఱించి
మెదను దలపోసికొంచు వహింప నిద్ర
స్వామి గలఁగాంచెనొకనాఁడు రామకృష్ణుఁ
డుదధిఁజొచ్చుచుఁ దనుఁబిల్చుచున్నయట్లు ౪-౨౪

గీ. అంత మేల్కాంచి స్వామి సాష్టాంగనతులు
సేసి యనె "దేవ! యిగో! ప్రతీక్షించుచుంటిఁ
దావకాజ్ఞకు; నేఁటికి సేవకుఁడగు
నాపయి న్నీకు దయగల్గెనా?" యటంచు ౮-౨౫

గీ. హైదరాబాదునుండి ప్రయాణమయ్యె
స్వామి యాచార్యదేవుని రామకృష్ణు
పత్నియగు శారదాదేవి పాదపద్మ
దర్శనమొనర్చి దీవనల్ తగ గ్రహింప. ౮-౨౬

కం. గురుపత్నినాఁగ రెండవ
గురుదేవతయంచు నెంచుకొందురు శిష్యుల్;
గురువుకడకఱచువిద్యకు
గురుపత్నిశుభాశిషములగుఁ దోహదముల్. ౮-౨౭

గీ. శారదామాత దివ్యాశిషంబులంది
స్వామి చింతించుచుండంగ వ్యయముఁగూర్చి
సిద్ధసంకల్పుఁడగుట విచ్చేసె నొక్క
కమ్మఁగొని లెంకయొకఁ; డిట్లుగలదు దాన. ౮-౨౮

గీ. "పూజ్యులగు వివేకానంద బుధతిలకుల
పాదపంకజసంచరద్భంభరంబు;
ఖేత్రిపురరాజు, పెద్దలసేవకుండు
వినతిపూర్వకముగ వ్రాయువిన్నపంబు. ౮-౨౯

మ. భవదాశీర్వచనప్రభావమున నా
భాగ్యంబుపై కుబ్బె; మ
ద్భవనంబం దుదయించెఁ జంద్రుఁడు; మదు
ద్యానంబుపుష్పించె; నా
భువియందున్ లభియించె రత్నఖని; యీ
పుత్త్రోదయానంద మే
భవదీయంబగు దివ్యదర్శనముచే
వాంఛింతుఁ బూరింపఁగన్. ౪౩౦

సీ. తమరు పశ్చిమఖండయాత్రనుగుఱించి
ముచ్చటించుచునుంటిరి యచ్చటచట
నా వ్యయంబును భరియించునట్టిభాగ్య
మొదవునే? నాకటంచుఁ బొందుదును జింత" ౪౩౧

కం. అని యున్న జాబుఁగని యా
క్షణమున "సంపన్నమయ్యె సర్వంబును నా
కనఘుఁడు గురుదేవునిదయ"
ననుచున్ క్షేత్రీపురప్రయాణ మొనర్చెన్. ౪౩౨

ఉ. పొచ్చెములేనిభక్తిమెయి
భూపవరేణ్యుఁడుం దల్లతాంగియున్
వచ్చినస్వామిదివ్యపద
పద్మయుగంబును సమ్మదాశ్రులం

గ్రచ్చఱఁగడ్గి స్వీయకర
కంజములన్ వరివస్యసేసి తా
రిచ్చిరి వానిచేతి కతఁ
డిచ్చిన యా పసిముద్దుపాపనిన్ ౪౩౩

గీ. శిరసునం జేయినిడి 'చిరంజీవ' యంచు
నతఁడు "స్వస్త్యస్తు"టంచు 'శ్రీర'స్తుటంచు
బిడ్డనాశీర్వదించి, దీవించి వారిఁ
బ్రణతశిరసుల సంతోషపఱచెఁ గరము. ౪౩౪

## ౧౨ మొదటి అమెరికా ప్రయాణము.

గీ. సర్వసన్నాహములొనర్చి స్వామియాత్ర
కార్యుఁడగు క్షేత్రిపతి యాత్మకార్యదర్శిఁ
బంప వెంబడిఁ, జేరి ముంబాపురంబు
నెక్కెనోడను వీడ్కోలునీయఁ బ్రజలు. ౪౩౫

శా. చీనాలోదిగి బౌద్ధమందిరము లీ
క్షించెన్; జపాన్ దేశ్యముల్
నానాయంత్రపరిశ్రమాలయములం
దర్శించెఁ; దద్వర్గ్యవి
జ్ఞానాభ్యున్నతి, దేశభక్తియును, ద
జ్జాత్యైక్యస్వనిద్రాణ ని
ర్మాణప్రౌఢిని మెచ్చుకొంచమెరికా
రాష్ట్రంబుఁ జేరెం దుదిన్. ౪౩౬

కం. అతఁడు "షికాగో"నడుగిడ
"మతసభ జరుగు నిఁక రెండుమాసములకు; ద
త్ప్రతినిధులును నిర్ణీతుల";
యితి విని తనరాకయయ్యె వృథయని వగచెన్. ౪౩౭

సీ. స్వామి క్షణమూరకుండి "శ్రీరామకృష్ణు
నాజ్ఞ, శారదాదేవిదివ్యాశిషములు
గావు నిష్ఫలములుగ; మార్గంబు నాకు
దొరకకుండద"యని ధైర్యమఱకయుండె. ౪౩౮

కం. ప్రతిభాసమన్వితుండగు
నతండు పెదవింగదల్ప నచ్చటి ప్రజ య
ద్భుతపడెఁ; గర్ణాకర్ణిగ
శ్రుతమయ్యెను వానిలోఁతు సూరివరులకున్. ౪౩౯

కం. మతపరిషత్ప్రేషిత పం
డితులనె ప్రతినిధుల గాఁగ నియమించెడి ప
ద్ధతి నుల్లంఘించు సభా
పతి స్వామిని నర్హతమునిఁ బ్రతినిధిగఁ గొనెన్. ౪౪౦

మ. నియతంబైన దినంబునందు సభ సం
ధింపంబడెన్; దిగ్విశా
లయశోధుర్యులు వేలమంది విబుధుల్
పాండిత్యనిష్ణాతు ల

య్యయి దేశార్హములైన వేషములతో
నాసనులై రందు ది
వ్వియ లాస్యంబులయొద్ద నిష్ప్రభములై
పెంపేది కానంబడెన్. ౨౨౧

౧౩ విశ్వమత సభారంగము.

ఆ.వె. కావిశాటితోడఁ, గావిలుంగీతోడఁ
బసిఁడివన్నెలీను పాగతోడ
బ్రహ్మతేజముట్టిపడు నాననముతోడ
నచట దర్శనీయుఁడయ్యె స్వామి. ౨౨౨

కం. “ఎవరీతం ? డెవరీతం ?
డెవరీతం ?” డంచు మోములెత్తికసిరి స
భ్యవరులు; వైలక్షణ్యము
ప్రవచింపఁగరాని దెదియొ? వారి కగపడెన్. ౨౨౩

చ. ప్రతినిధు లొక్కరొక్కరె స
భాపతివేదిక నెక్కి తీసి కా
గితములు ముక్కటద్దము లొ
గిన్ సవరించుచు మధ్యమధ్య దృ
క్తతి సభపై నిగుడ్చుచును,
దాండవమాడుచు, బల్లగుద్దుచున్
క్షితి స్వమతంబె మోక్షమును జేర్చునటంచు
నహంకరించుచున్. ౨౨౪

కం. పులుముడు పులిమిరి యా యా
పలుకుల, నాపాతమధురభావంబుల, వా
రలు; 'బఘుటబటారము లో
పలను లొటారం' మనుగతి నుపన్యాసముల౯ ౧౧౫

కం. ప్రతిప్రతిసిథియును దనకా
గితమె మహత్తమమటంచుఁ గీర్తించుకొనె౯
బ్రతివాఁ డద్దమున ముఖ
ప్రతిబింబముఁగాంచి సుందర మ్మనుకొనఁడే! ౧౧౬

కం. తరువాతి వంతువచ్చెను
నరేంద్రునికి; మొదటఁ గంపనమునొంది యతం
డలముడిఁగి రామకృష్ణుని
స్మరించి యుత్సాహమొంది చనివేదికకు౯. ౧౧౭

గీ. మొగిచి కేలు "సభాయై నమో" యటంచు
హైందవాచారముంబట్టి "అమెరికా స
హోదరీ సహోదరులార!"నాఁ దదీయ
నవ్యసంబుద్ధిఁ గరతాళనాద ముబ్బె. ౧౧౮

కం. అడఁగఁగ సముద్రఘోషము
వడువునఁ గొండొక్కవడి కుపన్యసియింప౯
గడఁగె నతఁ డాశుశక్తినిఁ
జిడిముడిగొనకుండఁ బలుకుచేడియపగిది౯. ౧౧౯

గీ. "కలఁడు భగవంతుఁడొకఁడని యిలఁ గలట్టి
యెల్లరు మతస్థులొప్పిరిం; కేమి భేద ?
మనఁగ నదనియమందిరంబునకుఁబోవు
మార్గములె భిన్నభిన్నముల్; మతము లివియె ! ౪౫౧

గీ. వంకలెల్లయుఁ గడలికేపాఱునట్లు
వివిధమతసంప్రదాయముల్ వేయునేల ?
ఋజువులైనను, గుటిలంబులేని నిజము
సాఁగు నాపరమేశ్వరు సన్నిధికినె. ౪౫౨

కం. "ఎవరేగతి భావించిన
నవుదును ప్రాప్యముగ వారి కారూపముతో
భువి"నంచును భగవంతుం
డు వచించెను గీత నర్జునునకుం బ్రీతిన్. ౪౫౨

గీ. శ్రీపరాత్పరు సాక్షాత్కరించుకొనఁగఁ
దివిరి సామీప్యమార్గంబుఁ దెలుపునట్టి
మతమె యత్యుత్తమంబైన మతము సుండు !
కాదు నిర్ణాయకంబు సంఖ్యాబలంబు. ౪౫౩

గీ. మానసం బద్దమట్లు నిర్మలినమైనఁ
బ్రతిఫలించును దానఁ బరాత్పరుండు ;
జీవి యంతర్ముఖమున నీక్షించెనేని
నతఁడు సాక్షాత్కరించు; దివ్యత్వమొదవు. ౪౫౪

కం. భగవత్సాక్షాత్కారమ
నగ నపరోక్షానుభూతినా, మోక్షమునా
భగవత్సాయుజ్యమునా,
భగవత్ప్రాప్తియన నొక్కభావమె చుండీ! ౧౫౫

గీ. పుణ్యఫలముగ స్వర్గంబుఁబొంది జీవి
యది సమాప్తంబుగా భూమియందుఁబుట్టుఁ;
గర్మనాశంబువలన మోక్షము లభింప
మరలఁబుట్టక కలియు బ్రహ్మంబునందు. ౧౫౬

గీ. జనుఁడు సేవింపవలయు నౌషధము విడక
దీర్ఘరోగంబు నశియింప దీర్ఘకాల;
మట్ల మనపూర్వపూర్వజన్మాఘ మడఁగఁ
బెద్దవడి దైవతంబు సేవింపవలయు. ౧౫౭

గీ. విరియఁగ మొగిళ్లపిండు వేవెలుఁగులడర
నంబుజాప్తుండు ప్రత్యక్షుఁ డగునుగాదె?
సంచితంబగుకర్మ నాశమునుబొంద
నరగఁ బరమేశ్వరుండు సాక్షాత్కరించు. ౧౫౮

మ. చెఱసాలంద్రుబుధుల్ ప్రపంచము నిసీ !
జీవుల్ పురాజన్మలం
బొరిఁగావించిన పాపకర్మలఫలం
బుం బొంద నేతెంచుచుం

దురు; తత్తద్దురితంబుఁబట్టి కలుగుఁ
న్యూనాధికంబైన శి
క్ష; రుజాదుఃఖముఁ దొట్టి; శాశ్వతిక సౌ
ఖ్యంబబ్బు మోక్షంబునన్. ౪౫౯

ఆ. వె. మరలమరల జననమరణముల్ లేకుండ
భగవదైక్యమగుట ప్రాణికిగుఱి;
కర్మఁజిత్తశుద్ధి; జ్ఞానమద్దానఁ, ద
ద్భగవదైక్యమొదవు దానఁదుదికి. ౪౬౦

క. అన్యులెల్లరు దలఁచి సుధాబ్ధియంచుఁ
జిత్తగింపంగ సంసారజీవనంబు
భారతీయులు ముఱికికూపంబటంచు
నూబిసేలంచుఁ గడు సేవగించినారు. ౪౬౧

సీ. పసిఁడిదువ్వాలువలు విసిరిపాఱఁగ వైచి
కావిపుట్టంబులఁ గట్టినారు
రమణీయరత్న సౌధము లలక్ష్యమొనర్చి
చీఁకటిగుహాల వసించినారు
రసరసాన్నములు నీరసమంచుఁ బోఁద్రోసి
వేళ్లు వెల్లఁకుల సేవించినారు
పువ్వులసెజ్జలు దవ్వుదవ్వుల రోసి
పటపురానేలలఁ బండినారు.

సీ. ఆత్మభోగార్థము విచిత్రయంత్రములను
బహులు గనిపెట్టుచుండంగ భారతర్షు
లాత్మమోక్షార్థము తపంబు నాచరించి
యాపరాత్పరుఁగాంచి రత్యద్భుతముగ ౪౬౨

సీ. అన్య దేశ్యుల గమ్యలక్ష్యంబు చూడ
నాకలోకంబ; ప్రాచ్యదేశర్షి "అదియు
నశ్వరంబిస్సి" యని రోసి శాశ్వతంబు
నపునరావృత్తియగులోక మభిలషించె ౪౬౩

సీ. అన్య దేశ్యులసంస్కృతి యాశ్రయించి
పత్తనపురంగములఁ దాండవంబునాడ
భరత దేశ్యులసంస్కృతి వాసముండె
శైలగుహాలందు వనతరుచ్ఛాయలందు ౪౬౪

కం. పరతత్త్వంబును సాక్షా
త్కరించుకొన్నట్టి ఋషులు ద్రష్టలు గల రెం
దటో! హిందు దేశమందుం;
బర దేశములం దొకండు పరగెనె! చెప్పుఁడా! ౪౬౫

మ. తనచుట్టుం బెనుగూఁటి నల్లుకొని త
ద్గర్భంబునంజిక్కి పై
ల్చన రాఁజాలక పైకి నందె మడియున్
సాలీం; డ్లటుల్ భోగ్యవ

స్తునికాయంబును సృష్టిసేసికొని హా
ద్దుల్ మీఱి నందుండి మో
క్షణముం బొందఁగ దారిఁగన్గొనరు పా
శ్చాత్యుల్ శతాబ్దాలకున్ ౪౬౬

గీ. ఇదె సనాతనమతతత్త్వ; మీమతంబె
హైందవీయంబు, వైదికం, బౌపనిషద,
మార్షము, నటంచు భిన్నభిన్నాహ్వయముల
వ్యవహరింతురు; వీని సిద్ధాంత మొకటె! ౪౬౭

గీ. విశ్వభాషలఁగల గ్రంథబృందమందు
నాద్యములు వేదముల; వాని యాది దెలియు;
దట్లగుట వేదమతమును వ్యవహరింతు)
విబుధులు సనాతనంబని పేరు పెట్టి ౪౬౮

గీ. అవనిఁ గ్రీస్తుమహమ్మదీయాదిమతము
లయ్యయిప్రవక్తలంబట్టి యాధునికము;
లీసనాతనమతము గాకివ్విధంబు
ఉన్న దజ్ఞేయకాలంబునుండి కనుఁడు. ౪౬౯

గీ. కావున సనాతనమతంబె కన్నతల్లి
యఖిలమతముల; కిందు లేనట్టి వితర
మతములం గానరావు ధర్మములు; దీన
నున్న వేకొన్నియో యొప్పుచుండు నందు." ౪౭౦

ఆ. వె. ఇట్లు సజలజలదమట్లు గంభీరరా
వంబుతోడ సభ నుపన్యసించు
చాఁగి నిముస, మడిగె హైందవమతతత్త్వ
మెఱిఁగియున్నవార లెంద? ఱంచు ౪౭౧

చ. అనవుడుఁ జేతులెత్తి రట
నైదుగు రార్గురె వేలమందిలో
ననె నపు డావివేకుఁ డిటు;
"లక్కట! మామతబాలశిక్షలుం
గనుఁగొననట్టి పండిత శి
ఖామణు లెందఱో! వెఱ్ఱిగా విమ
ర్శన మొనరింత్రు; లాఁతు లిటు
సల్పిన మీరలు సైఁచియుందురే? ౪౭౨

క. స్వమతపరమతధర్మతత్త్వము లెఱింగి
పరమతవిమర్శనము సేఁత పాఁడియగును;
జ్ఞానలవదుర్విదగ్ధులఁ గాంచి వీరి
బాలకు లటంచు క్షమియింత్రు ప్రాజ్ఞవరులు." ౪౭౩

ఆ. వె. అని యుపన్యసించి హస్తాబ్జములు మోడ్చి
వినయమునఁ గృతజ్ఞతను వచించి
యాసనంబుడిగ్గ నత్యద్భుతముగఁ జ
ప్పట్లవాన గురిసి పెద్దవఱదవాఱె. ౪౭౪

కం. ప్రతివిషయము క్రొంగ్రొత్తై
ప్రతిశబ్దము నూతనార్థబంధురమగుచున్
అతితమముగ నాశ్చర్యచ
కితులం గావించె నతనికృతభాషణలోన్. ౪౭౫

కం. దివిటీకడ దివ్వెలవలె
'వివేకు'కడఁ గానఁబడిరి పెఱప్రతినిధు; ల
ప్లవలోకించిరి సభ్యులు
భువికి దిగిన దేవదూతపోలికి నతనిన్. ౪౭౬

కం. కరచాలనంబొనర్చిరి
తఱిసి మహామహులు పండితశిరోమణు ల
త్తఱి; స్వామిఁ బ్రశంసించిరి
పరస్పరముఁ ద్రోసికొంచువచ్చి సభికులున్. ౪౭౭

చ. మతసభయందుఁ బాల్గొనిన
మాన్యులలో శశిసోలెఁ దారకా
వితతినిఁ దేజరిల్లెను వి
వేకుఁడె సర్వకళాప్రపూర్ణుఁడై
కుతుకమెలర్ప సభ్యులు చ
కోరములట్టులు ప్రీతిఁ దద్వచో
మృతమునుగ్రోలి; రివ్విధము
నెవ్వరుఁగాంచరు పూర్వ మెన్నఁడున్.

సీ. పులకండములమొత్తమును బైకిదొరలించు
మాద్రి నింపారెను మధురకంఠ;
మతిలోకమైన పూజ్యతకు సాక్ష్యంబిచ్చు
తెగనుండె వినయవిధేయవృత్తు;
లమరగంగాప్రవాహమునకు సైదోడు
రహీనొప్పె నాశుధారాక్రమంబు;
విజ్ఞానరాశిని వెసఁ జేటలంజెర్వు
నట్టులం దగె నుపన్యాససరణి;

గీ. మేరమీఱినప్రతిభ, మైసౌ, రివెల్ల
మించి నొకదానినొకటి యూహించరాని
పగిది లోకోత్తరత్వంబుఁ బగటు; నిట్టి
విబుధమణి "నభూతో నభవిష్యతి" క్షితి ౪౭౯

కం. అతని ముఖనిస్సృతంబగు
ప్రతిశబ్దము వదల కక్షరము నాత్రముకోఁ
ప్రతివారు వినిరి; నిశ్చే
ష్టితులయి వీక్షించి; రుగ్గడించిరి వానిన్. ౪౮౦

శా. వార్తాపత్త్రికలెల్ల స్వామిమహితో
పన్యాసముం, బాండితీ
స్ఫూర్తిం, గీర్తిసిఁ, బూర్తిసిం బొగడుచున్
ముద్రించె వ్యాసంబులన్;

వార్తిం బట్టె 'షికాగో' పత్త్రసంచయము
సామ్రాజ్యం బూనెంగుచోఁ;
వర్తించెం బురకుడ్యపంక్తిని నగ
ణ్యంబైన తచ్చిత్త్రముల్. ౪౮౧

కం. అహమహమిక నప్పౌరులు
మహామహునికి నతనికి సమర్పించిరి తా
రహారహ మాతిథ్యంబులు;
విహాయసంబంటి యతఁడు వెలిఁగె ననవిరళ్. ౪౮౨

కం. అల క్రైస్తవపాషండుల
కులపత్త్రిక వ్రాసె; "నిట్టికోవిదులకుఁ దా
వలము భరతదేశము; వా
రలకే మనబోధకులు గఱపువార లిసీ? ౪౮౩

కం. రతనంబు శ్రీవివేకుఁ;
డితరబుధులు గులకరా లిసీ! మతసభలోఁ;
రతనము లితరులనగుచో
నతఁడు * "కులీనన్" రతనమయగు నిక్కముగన్. ౪౮౪

* ప్రపంచమందలి రత్నములన్నిటిలోఁ బెద్దది 'కులీనన్' రత్నము. ఇది ౩౦౧౬ కేరట్ల తూకము గలది.

గీ. వేయునేఁటికిఁ? బాశ్చాత్యవిజ్ఞకోటి
వారి శుశ్రూషఁగావించి వ్రాల్చి శిరసు
వారివిద్యలుగఱచుటే వాంఛనీయ;
మందుకై బోధకులఁబంపు టర్హ" మనుచు. ౮౧౯

చ. "నలువది యేండ్లనాఁడు మత
నాయకులైన భవాదృశార్య లీ
స్థలమున నిట్లు క్రైస్తవ ను
తంబు విమర్శ మొనర్చియున్నచోఁ
శిలలను రువ్వియో? శిరసు
ఛిన్న మొనర్చియొ? కాల్చివేసియో!
నిలువునఁ జంపియుం"డని య
నెన్ బుధుఁ డొక్కఁడు డాసి స్వామితోన్

కం. "స్వమతాహంకారోన్మా
దము నరనరముల జిఱించి తప్పితిరుగు ప
శ్చిమసీమఁ జికిత్సింపఁగ
నమోఘవైద్యుండవీవె!'' యని యొక్కఁడనెన్. ౮౨౧

గీ. సభ్యరంజన మొనరింపఁజాలనట్టి
వక్త్రుపన్యాసమును వీడి బయలికేగు
పారిషద్యులఁగని సభాపతి వచించు
"వేఁచుఁడీ! యుపన్యసించు వివేకుఁ"డంచు. ౮౨౨

సీ. "అయిదునిమిషాల తడవె మాటాడు"నని స
గోణుఁగుకొంచేదొ ? వక్తపై సణుఁగుకొంచుఁ
నయిదుగంటలు వేచియుం డ్రతనికొఱకు
విసరుకొంచును నా మందు వేసఁగితఱి. ౪౮౯

## ౧౪ అమెరికాదేశ పర్యటనము

కం. మతసభలోఁ బ్రాపించిన
ప్రతీతినిం గాంచి స్వామ్యుపన్యాసములన్
ఇతరత్ర యేఱుపరచిరి
మతిమంతులు గొంద ఱొక సమాజము పేరన్. ౪౯౦

చ. అనుకొనె స్వామి" యమ్యెమెరి
కాదిక పశ్చిమసీమలన్ సనా
తనమతధర్మతత్త్వమును
దానఁ బ్రచారముసేయవచ్చు" నం
చనుకొని రాసమాజగతు
లా మిషచే ధనముంగడింప వ
చ్చు ననుచు ; స్వార్థబుద్ధు లవి
శుద్ధులు పశ్చిమఖండమానవుల్. ౪౯౧

సీ. అమెరికాదేశమందు ముఖ్యాతిముఖ్య
పట్టణంబుల నన్నింటి స్వామి దిరిగి
వరసనాతనధర్మ ముపన్యసించి
మోహముంద్రుంచి వారి యపోహ లడఁచె. ౪౯౨

కం. పలువురు క్రైస్తవ గురువులు
గల యొక సభయందు నమెరికాఖండమునన్
బిలువఁబడి స్వామి చని యటు
దులిపివయిచె హైందవమతదూషకుల నిటుల్. ౪౯౩

శా. " మీరల్ క్రీస్తుమహాత్ము శిష్యులరు నే
ల్మేల్ ; మీ మతాచారముల్
చారిత్ర్యంబులు రొచ్చుగుంటల పరీ
క్షం జేయ ; మా భారత
క్ష్మారంగంబు మరమ్మతుం జలుపు సా
క్షా ద్దేవదూతల్వలెన్
నోరున్ వాయియు లేని జానపదులన్
మోసించి లోఁగొంద్రిసీ ! ౪౯౪

చ. గుడికడనిల్చి మీదుమత
కోవిదు లచ్చటి కేఁగుదెంచుచుం
ఔడి జనసంఘమాఁపి " గమ
నింపుఁడు ! విగ్రహపూజసేసి మీ
ర్చెడుదురు ; నారకంబునకుఁ
జేరుదురందురు ; మాదు వేల్పులన్
గుడులను , వేదశాస్త్రముల
గ్రుక్కను ద్రిప్పక తిట్టుచుం ద్రొగిన్.

కం. పరనిందయు, నాత్మస్తుతి,
యరయఁగఁ గులవిద్యమీకు ; నా శాస్త్రమునన్
బిరుదులుగాంచినవా ర్మత
గురువులు ; లోకోద్ధరణమె గుణికాంబోలున్. ౧౫౬

గీ. ఏల? ప్రేలెత్తినావుఁడా! యెవ్వఁడేని
హైందవుండొక్కఁ డీగడ్డ కరుగుదెంచి
మిమ్ము విమర్శించినాఁడె? నమ్మెదము నేము
కృష్ణుని "శ్రేయాన్ స్వధర్మో విగుణ" యటంచు ౧౫౭

ఆ.వె. కత్తిదూసి నెత్రుకాల్వలు గట్టించి
కాదె? మీరు ఖండఖండములను
ప్రాఁకఁ జేసితిరి; భవన్మతంబునఁ బ్రేమ
సహనములకుఁ గలదె స్థలము సిలువ ? ౧౫౮

మ. పతితోద్ధారము పేరు పెట్టుకొని సం
పాదించి యీసము ద్ర
వ్యతతిం గ్రీస్తుమతప్రచారమునకై
యద్దాని వెచ్చించి భా
రతదేశంబునఁ "జీల్చివేలుఁ"డను మీ
రా ద్ధర్మముం గార్యరూ
పత నొందించుచునుంటి; రా జనులు మా
పక్షమాపయిన్ ద్వేషమున్. ౧౫౯

ఆ. వె. ఓనమాలురాని, మోబయ్యలకు నెర
గోలిపికాడె? మీరు గలుపుకొంద్రు;
పాలకులును మీదు వంశస్థులగుటచే
సాఁగివచ్చు మీదు నాగడంబు. ౫౦౦

కం. శ్రుతియుక్త్యనుభవములచే
మతిపేరులంశోడఁబోరి మార్చెను దొలిఁ ద
న్మతమును శంకరుఁ; డీరలు
వెతకి నిరక్షరుల మార్చివేతురు సరియే! ౫౦౧

కం. హిందూమహాసముద్రము
నందుంగల యడుసుఁదీసి యా మీపై నే
మందఱము వేసినను మా
యందలి మీచేయుద్రోహ మడఁగదు చుండీ! ౫౦౨

సీ. ఎంతవిద్వాంసులైన మీ రిక్కృతమునఁ
గారు నిజమైన క్రైస్తవుల్ కారు! కారు!
పరమతద్వేషమును క్రీస్తు గఱపినాఁడె?
అతఁడు జీవించియున్న నేమనితలంచు? ౫౦౩

కం. నిజముగ మీయాచార్యత
"సజీవమయి యుండవలయు" సవిఁదలఁచితి రే
ఋజుగతి మతప్రచారముఁ
బ్రజలకుఁ జేయుండు! సత్యపథమున మనుఁడా!" ౫౦౪

మ. అనుచుం గ్రైస్తవదేశమధ్యమునఁ గ్రై
స్తాచార్యసంసత్తృలిం
బెనుభూతం" బిదినాఁగ నిర్భయముగా
నిశ్శంకగాఁబల్కె ని
ట్లనె; "నే నిచ్చకమాడ; నున్నయది యు
న్నట్లందు మోమోటలే
కను; దప్పించినవానినిన్ సఖునిఁగాఁ
గైకొంద్రు మాహైందవుల్" ౫౧౫

కం. సుడిగాలి ధూళి రేఁపిన
వడువునను వివేకుఁడిడు నుపన్యాసమునన్
గడుఁగడు నుక్కిరిబిక్కిరి
పడిరి మతాచార్యులా సభారంగమునన్ ౫౧౬

కం. విని దీనిఁ గొందఱుత్తమ
జను లెద సిగ్గిలిరి; పరు లశక్తతయును దు
ర్జనతయుఁగలవారగుటను
ఘను నాతని బ్రువ్వఁ దిట్టఁగాఁ గడఁగిరి సీ! ౫౧౭

కం. అతనిపయి వేయఁబూనిరి
మతకరిపూఁబోండ్ల వాని మనికి కనిపి కు
త్సితమతులగు నామతగురు
హతకులు నీలాపనింద లనవధికముగాన్. ౫౧౮

కం. కుక్కలు మొఱిఁగిన నేనుఁగు
లెక్కింపనిచంద మెద నిలిపి దూషణముల్,
ధిక్కారములు, గణింపక
ముక్కుకుసూటిగ నతండు పోవుచునుండెన్ ౫౦౯

సీ. ఆ యుపన్యాససంస్థకు నధికధనము
స్వామ్యుపన్యాసములచేత వచ్చుచున్న
దొంగ లెక్కలు సూపి యాదొర లొసంగి
రందు నాలవవంతె యూయతివరునకు. ౫౧౦

కం. తెలిసికొని వారియనృజుతఁ
దొలంగి యాసంస్థనుండి దూరంబుగ, న
ర్మిలి నుచిత మొసఁగుచుండెను
వలసిన వారలకుఁ దా నుపన్యాసములన్. ౫౧౧

కం. ఎచ్చటవిన్న వివేకుని
ముచ్చటె! యెచ్చోటఁగన్న బూజ్యతముని భా
స్వచ్చిత్రములే గోడల;
మెచ్చెడిపత్త్రికలె నాఁ 'డమెరికా' యందున్. ౫౧౨

చ. పలువురు శిష్యులై యతని
వద్దను వాసికపట్టువైచి భూ
తలమునఁగూరుచుండి యమి
తంబగుభక్తియు శ్రద్ధయుం దగన్

గొలుచుచుఁ బోరముల్ చదువు
కోఁగఁదోడంగిరి యాంత్రవిద్యలో;
సలఁతిరితఱిఁ సుశిక్షితుల
నాతఁడొసప్పఁగ నైరి పండితుల్. ౫౧౩

సీ. ఆబుధుఁడు గుడజహ్వాకొన్యాయమునను
దెలుపు దుర్గ్రాహ్యవిషయముల్ తేట తెల్ల
హాస్యమధురోక్తులనుముంచి హర్షపఱచు;
తతనిబోధన మద్వితీయం బటంద్రు. ౫౧౪

సీ. అమెరికాలోని స్వామి జయారవంబు
పిక్కటిల మాఱుమ్రోఁగుచు దిక్కులెల్ల
స్వసుతు వైభవముం గాంచి భరతమాత
విడిచె నానందబాష్పంబు లెడఁదగరఁగ. ౫౧౫

కం. మదరాసుపత్తనంబునఁ
బెదపెద్దలు గూర్చిసభ వివేకానందుం
బదిఁబదిగఁ బ్రశంసించిరి
తదీయమతసేవకొసఁగి తగ జోహారుల్. ౫౧౬

కం. కలకత్తానగరంబునఁ
బలువురుపండితులు ప్రాడ్వివాకులు, సుద్యో
గులుఁ, బత్రికాధిపతులును
నలంకరించి రొకసభఁ దదర్చార్థముగాఁ. ౫౧౭

కం. "భూనుతయశస్వికి, వివే
కానందస్వామికిఁ, మహాపూజ్యునికిఁ
మానితసనాతనమతా
ఖ్యానకదుందుభికి నివియె ! సాష్టాంగంబుల్. ౫౧౮

శా. స్వామీ ! క్రైస్తవలోకమధ్యమున నా
స్మాకీనహిందూమత
ప్రాముఖ్యంబు సహస్రకంఠములతో
వ్యాఖ్యానముం జేసి త
ద్ధీమత్సంఘము బుద్ధిమార్చిన భవ
త్కీర్తుల్ శ్రవఃపేయముల్;
సామోదం బభినందనంబులను మీ
కర్పించుచున్నా మిగో ! ౫౧౯

మ. మనకుం గల సభ్యత లేదు; దధఃపతిత మా
స్మాకంబు సంఘంబటం
చు నవాచ్యంబులు పెద్దవారెడఁ బ్రతీ
చ్యుల్ వ్రాసి దృగ్దోష మా
ననముల్ వ్రాల్చిరి నీప్రబోధమున; ధ
న్యత్వంబుఁ గాంచెం నినుం
గని శ్రీభారతమాత; నీయనుజులై
గర్వింతు మేముం సుధీ ! ౫౨౦

కం. తనుఁగనఁజాలక విశ్వం
బునుగనఁగయతించు నద్వైమూఁకకు దయతో
ననఘమగుదృష్టి నొసఁగిన
మనీషిచంద్రా ! యివే ! నమస్కారంబుల్. ౫_౨౧

గీ. ఆర్షమతధర్మసంప్రదాయములఁ బెరిగి
తదవలంబంబు విడిన హైందవుల కీవు
నాయకత్వంబూని యార్షఋణంబుఁదీర్ప
జాగరూకులఁజేసితి స్వామి ! జేజె. ౫_౨౨

గీ. అర్థకామైకతత్పరం, బాత్మమూని
యయిన పాశ్చాత్యఖండమిం కనవరతముఁ
బ్రాచ్యఖండంబునొద్ద, ఛాత్రక మొనర్ప
సాఁగు; నీయధమర్ణు లీజాతివారు. ౫_౨3

గీ. మీసదుద్యమ మెల్లభూమీతలంబుఁ
బ్రాఁకి శాఖోపశాఖలై వర్ధిలంగ
స్వామి ! దీర్ఘాయురారోగ్యభాగ్యము లిడి
చెలఁగి విశ్వేశ్వరుండు రక్షించు మిమ్ము." ౫_౨౪

కం. అనుచు న్నభినందనలే
ఖ నైకకంఠ్యముగ వ్రాసి కడుభక్తిని వా
రనిపి రమెరికాఖండ
స్థ నభోమణియైవెలుంగు స్వామివరునకున్. ౫_౨౫

కం. పలువురు హిందూదేశపు
నలుమూలలనుండి సదభినందనశత మి
ట్టులెపంపిరి ; పత్రికలుం
దొలిపుట నింపెను జొహాన్లర్గ్‌ఓడనె ప్రీతిన్. ౫౯

మ. పోరి నాపశ్చిమఖండదేశ విబుధుల్
పుంఖానుపుంఖంబు పం
పిరి యాహ్వానము లామహామహుని వా
క్ప్రియూషముం గ్రోల నా
తురులై ; స్వామియు నుద్దిధీర్షువయి యు
ద్యోగించి తద్యాత్రకై
చరియించె న్నగరంబులుం, బురము, ల
శ్రాంతంబుగాఁ బల్లెలున్. ౬౦

సీ. ఇసుకవేసిన రాలక యెల్లవేళఁ
జుట్టుకొనుచుండ్రు చుబ్బనచూఱఁ గ్రోల
స్వామియుపదేశదివ్యవాచామృతంబు
వీర వారన; కాతండు విసువుగొనఁడ. ౬౧

మ. ఒకరా ? యిద్దఱ ? ముగ్గురా ? నలుపురా ?
యూరూర వేవేలు స్వా
మికృపం గైకొని స్వధర్మమున్ వదలి సా
మీచీన్యసంపాదికై

దికధర్మంబును బూని తత్పదయుగాం
తేవాసు లైరన్న, బం
ధకహా లాఁటివుతంబు; హిందుమత మే
తన్మోక్షకంబై తగుఁ. ౨౨౯

గీ. మతము నేకాదు; వారు నామములు, వేష
ములును మాఱిచికొనిరి సమూలముగ నె;
మాఱు హృదయంబె యెచ్చ్యది మాఱిపోదు?
అదియు మాఱుట కష్టసాధ్యంబుగాని. ౨౩౦

గీ. నాస్తికులుఁ, గ్రైస్తవులును, మానసికశాస్త్ర
వేత్త, లజ్ఞేయవాదులు, భిన్నభిన్న
ప్రకృతిశాస్త్రజ్ఞు లాతనివాదమునకు
నంజలిఘటించి యయిపోయి రాస్తికులుగ. ౨౩౧

కం. వాదింపవచ్చి యయి త
త్వాదాక్రాంతుండు క్రైస్తవమతాచార్యుం
డాదినమునుండి శుశ్రూ
పాదులఁగావించె శిష్యుఁడై స్వామి కొగిఁ. ౨౩౨

ఆ.వె. స్వామితోనొకండు చర్చింపఁగావచ్చి
చదురులేమిఁ దుదిని జదికిలఁబడి
గుండెజాఱ, నాల్కు కెండ, మంచముఁబట్టి
బ్రదికెఁ జావుదప్పి తుదికి నెట్లొ! ౨౩౩

సీ. స్వామిసందేశమాలించి వానిఁగొలిచి
యాత్మవిద్యోపదేశంబునంది తుదికి
సన్న్యసించిరి స్త్రీపుంసజనులుగొంద;
అమృతములభించెనేని స్పృహ్యంబుగలదె? ౫౩౪

కం. తదుపన్యాసశ్రవణముఁ,
దదీయసాన్నిధ్యవృత్తి, దచ్ఛిష్యత్వం
బొదవుటయుఁ బ్రజలు దలఁచిరి
యదృష్టఫలమేయటంచు నాఖండమునన్. ౫౩౫

సీ. అతని సన్నిధియందున్న నతని దివ్య
బోధ లాలించుచున్న, స్త్రీపుంసగణము
దివ్యలోకంబునందువర్తిలుచు గొందు
రద్భుతంబు నతీంద్రియంబగు సుఖంబు. ౫౩౬

కం. ఎక్కడిపశ్చిమఖండం?
బెక్కడిప్రాక్కాలికంబు హిందూమత? మె
ట్లెక్కెనో? గిరిశృంగముపై
కెక్కినచదంబునఁ గ్రిందియేఱ్ఱబముగన్. ౫౩౭

మ. తమ ప్రాబల్యము నాఁడునాఁటికిని
విద్వన్మండలంబందు క్షీ
ణముకాఁజొచ్చె; మతోద్యమార్థము వదా
న్యత్వంబు లోపించె లో

కమునన్; రాబడిదగ్గెఁ; గ్రైస్తవగురుల్
గగ్గోలుపాటొంది స్వా
మి మహత్త్వంబున మచ్చుఁ దేఁ దెగి రిసీ!
మిథ్యాప్రవాదంబులన్. ౫౩౮

ఆ. వె. లోకబాంధవుని విలోకింపఁజాలక
గుహల నణఁగియుండు గూబలనఁగఁ
గట్ట! యెదురుపడక క్రైస్తవాచార్యులు
చాటుమాటులందు సణుఁగుచుంద్రు. ౫౩౯

ఆ. వె. మాటలాడకుంటె మందని స్వామి ప్ర
త్యుత్తరింపఁబోఁడు దూషకులకు
నంతరరుల గెలిచినట్టివాఁ డెన్నండు
సరకుసేయు బాహ్యశత్రువులను? ౫౪౦

## ౧౫. లండన్ సమాగమము

గీ. అమెరికాలోని స్వామి డిండిమమ్ము మ్రోఁత
వినికి "లండన్" మహాపురీ విజ్ఞగణము
అతని దరిసింపఁ, దద్బోధ లాలకింప,
నఱ్ఱులను సాఁచియుండి రాహ్వానమంపి. ౫౪౧

సీ. "ఈ దివ్యపూరుషుండే? షికాగోపురీ
మతసభానాయకమణి యనఁబడె;"
"ఈ జగాజెట్టియే? యీ మన క్రైస్తవా
చార్యులపాలి చిచ్చఁజఁపిడుగఁట"

"ఈ మహాభాగుఁడే? యెలప్రాయమందు న
స్ఖలితవృత్తబ్రహ్మచారి యనిరి"
"ఈ పుణ్యమూర్తియో? యిల నరాకృతిఁగొన్న
చదువులవేలుపుఁజాన యంట"

తే. "ఈ మహాత్మకుండె హిందూమతాచార్యుఁ?"
"డీ ఘనుండొకో? యమోఘవక్త"
యనుచు నోడదిగిన యా వివేకానందుఁ
గనులపండువుగను గనిరి ప్రజలు. ౫౪౨

కం. అతనికిఁ దత్పౌరులు స్వా
గతంబు నర్పించి ప్రాజ్ఞఁగావించి సుసే
వితునింజేసిరి; "అభ్యా
గత స్స్వయంవిష్ణు"వన్న కథ సరిదాఁకన్. ౫౪౩

శా. మాయావాదముఁగూర్చి, ముక్తిఁగుఱుఁగు క
ర్మంగూర్చి, యోగంబునుం
బ్రేయశ్శ్రేయములం గుఱించియు సగం
భీరంబు పాశ్చాత్యదే
శీయుల్ మున్ విననట్టి యంశములు భా
షించె న్నుపన్యాసమం
దాయా క్రైస్తవ హైందవీయమత
సిద్ధాంతంబులన్ విప్పుచున్. ౫౪౪

కం. అడిగినప్రశ్నలకెడు నా
తఁడు ప్రత్యుత్పన్నబుద్ధిఁ దగిన సమాధానాల్;
విడివాదమునకు దిగెనా?
పడుపాటులు బ్రహ్మకెఱుకఁ ; బలుకం దరమా? ౫౪౫

కం. ద్యుతి నలుగడఁజిమ్మెడు నా
ద్యుతదీపసహస్రకంబు ప్రోవన వెలుంగన్
యతిచంద్రుండు సభాంతః
స్థితుఁడయి సభ్యుల కుపన్యసించుచునుండెన్. ౫౪౬

కం. తదుపన్యాసపరంపర
పదింబదిగ నాఁగఁదొడఁగెఁ ; బాపములును స
మ్మదితాంతఃకరణుల ; త
ద్వదావదుని కౌశలం బవర్ణ్యంబుగదా! ౫౪౭

కం. దొలుతటి గురుకులమందుం
బలె నాంధ్రులు, మగలు, నేలఁ బద్మాసనులై
కొలువందొడఁగిరి ; పాశ్చా
త్యలోకమును స్వామి సలిపె నధమోత్తమముల్. ౫౪౮

కం. జనసంఖ్య మెరగఁదొడఁగెను
దినదినమును స్వామిసభలఁ దెప్పలఁ దేలన్;
వినఁబడియె నతనినామమె
వనముల, వీథులను, విడిదిపట్టుల, నిండ్లన్. ౫౪౯

కం. ప్రకటించెను వార్తాప
త్రిక లాతనియుద్బోధోపదేశములను, ద
త్సకలోదంతములను, విడు
వక నొకటియుఁ బూసగ్రుచ్చుపదిగిఁ బొగడుచున్. ౫౫౦

మ. అతినందేశముఁ బ్రత్యహంబు విను చా
హ్లాదించి "మిస్ మార్గరెట్"
సతి విద్యాధనశీలసంపదల కా
స్థానం; బుపాధ్యాయి; య
ర్పితముం జేసి సనాతనార్ష మత సం
వృద్ధ్యర్థమై స్వామికిన్
సతృణంబాత్మధనంబు, శిష్యయయి దీ
క్షంబొందె మోక్షేచ్ఛతోన్. ౫౫౧

కం. నామకరణంబొనర్చెను
స్వామి 'నివేదిత' యటంచుఁ బ్రస్తుతయగు సా
ధ్వీమణికి; నామె భగవ
త్కామినియై తను నివేదితంజేసి కొనెన్. ౫౫౨

ఆ.వె. విడువలేక తన్ను విడువ లండన్ పౌరు
లమెరికాకుఁ దిరిగి యరిగె స్వామి
ఆత్మదర్శనంబు నర్థించు 'హరిదాసి'
ముఖ్యశిష్యతతి సముద్ధరింప ౫౫౩

సీ. అమెరికాదేశ విశ్వవిద్యాలయముల
స్వామి యాహూతుఁడయ్యె నుపన్యసింప;
విని యుపన్యాస మాతని వేఁడికొనిరి
ప్రాచ్యతత్త్వోపదేశకపదవిఁ గొనఁగ ౧౧౪

కం. పిలువఁబడి మరల మరల
నొప్పలికించెను రాజ,భక్తియోగంబుల సి
ట్టలముగ బోధాసవమును
బలుసంస్థల; స్వామిఁ జేనెపట్టనిరి జనుల్. ౧౧౫

కం. మొదలిడి కళపందొడఁగెను
వదలినపుటనుండి క్రొత్తపాఠంబుల నొ
ప్పిదముగ శిష్యావళికిం;
దదభ్యుదయకాంక్షఁ బ్రార్థనముసేయు గురుఁడా. ౧౧౬

కంఁ కనుచుం గ్రమ్మఱఁ గ్రమ్మఱఁ,
బునఃపునము వినుచు నతనిబోధలు, ఛాత్రుల్
తనిసియుఁ దనియరు మది ధా
త్రిని శ్రేయసి కేనతృప్యతే?’’ యంద్రు గదా! ౧౧౭

కం. గేహేశూరులు బళిరా !
గేహేనర్దులును నయిరి క్రీస్తుమతగురుల్
బాహాబాహి నెదుర్కొన
సాహసమెదజాఱ స్వామిసాన్నిధ్యమునన్. ౧౧౮

కం. "అనుభూతాత్మాచరణంబులు
వినా కఱపుచున్న క్రైస్తవియగురుల క
న్నను లెస్స యువ్విగల యీ
ఘనుండు (శ్రేష్ఠు"డని పత్రికలు స్తుతియించెన్. ౫౫౯

౧౯. కేంబ్రిడ్జ (అమెరికా) మహిళాసంఘాభినందనము.

గీ. అమెరికాఖండ "కేంబ్రిడ్జి"యందు స్వామి
చని యుపన్యాసమొసఁగె స్త్రీసమితియందుఁ
దమిని హిందూపురంధ్రి యాదర్శములను
వారలాలించి యద్భుతంపడి స్తవింప ౫౬౦

కం. మఱునాఁడు సభ్యురాండ్రం
దఱు స్వామిని గౌరవించి తనియక దానన్
బరిపూర్ణభక్తి 'భువనే
శ్వరీ'మహామాత కిట్లు వ్రాసిరి లేఖన్. ౫౬౧

శా. "మేరీమాత కుమారరత్నమును స్వా
మిన్ లోకకల్యాణకా
ర్యారంభార్థము క్రీస్తునింగనినయ
ట్లత్యంతపుణ్యాన దే
వేరీ! కాంచితి దివ్యమూర్తియయి పృ
థ్వీరత్నమై, సర్వలో
కారాధ్యుండయి శ్లాఘ్యుఁడైతగు వివే
కానందునిం బుత్రునిన్ ౫౬౨

కం. దరిసించి, యా మహామహు
కళఅవులు విని, దేవదూతగా ననుకొని, శి
ష్యాళికంబు సేయుచుంటిమి
తరింప ; నీకతన మేము ధన్యుల మంబా ! ౫౬౩

కం. తావకసుతుమూలంబునఁ
గావించెడు లోకసేవఁగని భగవతి ! నీ
పావనపదపద్మములకు
మావిధి యందుము నమస్సమర్పణ మిదిగో ! ౫౬౪

గీ. తల్లి ! "హిందూపురంధ్రి యాదర్శము"లను
స్వామ్యుపన్యాస మాలించి సత్యముగను
నీచరిత్రింబె యుంచుఁ జింతించినాము
స్వామి రోమాంచహర్షబాష్పములఁబట్టి. ౫౬౫

ఆ.వె. పుత్రవతివి నీవ భువి వివేకానందు
కతన ; మాతృమంతు డతఁడు జనని !
వేల్పుటావునోలె విబుధార్చ్యవైన నీ
కతన ; మిమ్ముఁబట్టి క్షితియు ధన్య. ౫౬౬

కం. నీ పెంపకము మహత్త్వమొ ?
నీ పుణ్యాశీఃఫలంబొ ? నీ దివ్యతయో ?
నీ పుత్రుఁడు నీరాజన
దీపంబై వెలిఁగె భూమిదేవి కరమునన్. ౫౬౭

ఆ.వె. అందుకొనుము ! మాత ! అస్మదర్పితము కృ
తజ్ఞతాపురస్కృతంబు నైన
వందనాళి ; మాకు నందింపుమీ ! దివ్య
జీవనంబు గలుగ దీవనంబు." ౪౬౮

గీ. అమెరికాయందు స్వామియుద్యమము సాఁగె
మూఁడుపూలాఱుకాయల పొలుపుఁబొడ;
సరవిఁ జదలంటె నార్షవిజ్ఞానమందు,
హైందవులయందు బూజ్యత్వ మద్భుతముగ. ౪౬౯

గీ. స్థాపనముసేసి "న్యూయార్కు" పట్టణమున
స్వామివర్యుండు వేదాంతసంఘ మొండు
అచట వేదాంతపాఠ, ప్రవచన, మోక్ష
పథగవేషణ, మతసహాత్మ్యము లమర్చె. ౪౭౦

కం. దరిసింప మరల "లండన్"
పురజను లాహ్వానమంపఁ బోయెను ; శిష్యో
ద్ధరణంబు, జగత్క్షేమం
కరకార్యారంభ మివియె కద ! లక్ష్యంబుల్. ౪౭౧

శా. ఆరంభించెను స్వామి పాఠములు వే
దాంతంబునన్ ; మెల్లఁగా
వారిం గన్గొని వీరు, వీరిఁగని వా
ర్వార్వచ్చి భూమిష్ఠులై

తా ర్యంబుగఁదాల్చి శౌక్యుల నమూం
తం బుభ్రమార్గంబునన్
సారావాసము కేగుచున్నటులై చిం
తం జేయుచుం ద్రత్తతిన్. ౫౭౭-౧

గీ. కర్మయోగంబు, జ్ఞానయోగంబు, రాజ
యోగహఠయోగములు, భక్తియోగకథలుఁ,
బాటఁబాడిన యట్లు యుపన్యసించె
విజ్ఞుఁ డాతండు ; కొట్టినపిండిపెల్ల. ౫౭౩

గీ. వివిధ పాశ్చాత్యతత్త్వశాస్త్రియు, హిందు
తత్త్వశాస్త్రియవిషయ సిద్ధాంతములను
ద్రాసునం దూఁచి తత్తారతమ్యములను
స్వామి సభ్యుల నిర్ణయింపంగ నడుగు. ౫౭౪

గీ. స్వామ్యుపన్యాసములు పెద్దవరదల వలె
ముంచి వేసెను లండనుపురజనంబు;
నలజడి జనించె వారి హృదంతరముల ;
విపరిణామంబు గలిగె జీవితమునందు. ౫౭౫

కం. ఆతని సందర్శనమును,
నాతనితో ముచ్చటించు, టాతనితో సం
గాత మొనర్చుటయుఁ, బ్రజా
వ్రాతంబు విశిష్టపుణ్యఫలమని తలఁచెన్. ౫౭౬

చ. వదలిరి బేరసారములు
వర్తకు ; లిండ్లకుఁ బెట్టి తాళముల్
కదలిరి పిల్లజెల్లగొని
కాంతలు ; బాలురు వీడి రాటలన్
ఉదయమునందు సాయమున
యోగివివేకుని బోధలన్ వినన్ ;
దదమృతపానలాలసము
నస్కృల కన్య మిలన్ రుచించునే ? ౫౭౭

కం. శతవృద్ధగు 'మాక్స్మ్యుల్లరు'
యతి నామంత్రింపఁబోయి యాంగ్లంబునకున్
శ్రుతు లనువదించిన మహా
మతి యాతనిచేతఁ బెద్దమున్నన లందెన్. ౫౭౮

కం. ఇరువురును జ్ఞానవృద్ధులె;
యిరువురుఁ దాత్త్వికులె; వారి యాకూటమి సుం
దరమయ్యెను రత్నములో
ధర రత్నముగూడుకొను విధంబున బళిరా ! ౫౭౯

కం. చనె నంత స్వామి * 'ప్యారి'కి
'జినివా'కు నచటఁగదలి "స్విజ్జర్లాండుం"
గని పిమ్మటఁ జేరెను "జ
ర్మని"కిన్ "డోయిసను" బుధుని మన్నన లందన్. ౫౮౦

---

*"ప్యారిస్" లోని 'స' కారము మూకాక్షరము (Silent letter)

మ. తను స్తోత్రించు యతీంద్రుఁడోఁ బలికె నం
తన్ "డోయిసన్" పండితుం
"డనఘా ! హైందవు లారసుల్ నిగమవి
ద్యారాశి; కస్మద్వృశుల్
వినుమీ ! దత్తులు; పంచమాంశకమె ప్రా
ప్తించుంగదా! మాకు; నా
య్యన వేయేండ్లు తపంబొనర్చినఁ జతు
ర్థాంశంబునన్ రాదుగా !" ౫౮౧

ఆ.వె. బ్రహ్మరథముఁ దనకుఁ బట్టినయట్టి "డో
యిసను" పండితునకు నొసఁగి ముదము
విడువలే కతండు వెంబడింపఁగ స్వామి
మరల లండనునకు నరుగుదెంచె. ౫౮౨

ఆ.వె. అతఁడువచ్చినట్టి యానాఁడు 'లండను'
పౌరజనము దలఁచెఁ బండువుగను
దప్పిగొన్నయట్లు దద్బోధనములకుఁ
బరుగువాఱెఁ దొంటికరణి బత్తి. ౫౮౩

కం. మరల నుపన్యాసంబులు,
మరలం బోధనలు, మరల మరలం బ్రశ్నో
త్తరములుఁ స్వామిప్రయత్నం
బరయఁగఁ బ్రతివాని మోక్షమందించుటయే. ౫౮౪

కం. కని తనయుద్యమ మెంతేఁ
గొనసాఁగుచు వేరుదన్నుకొనఁ బశ్చిమ భూ
మిని, స్వామి పయనమయ్యెను
దన మాతను మాతృభూమి దరిసింపంగన్. ౫౮౫

మ. తనవేదాంతమహోపదేశములచే
తన్ లోకముల్భ్రాంత లూఁ
పి నివర్తించి తదీయదృక్పథముఁ దె
ల్పెం దత్త్వజిజ్ఞాస నా
త్మను బుట్టించె; విచిత్రవృత్తమిది; ప్ర
త్యగ్దిక్ప్రవాహంబుఁ దూ
ర్పునకుంద్రిప్పిన ప్రాజ్ఞచంద్రుఁడు నరేం
ద్రుం డర్చనీయుం డిలన్. ౫౮౬

గీ. తెలిపి తనయాశయంబు శిష్యుల కతండు
పయనమునకు ముహూర్తనిర్ణయ మొనర్ప
వదలి ప్రేపల్లె మధురకుఁ బయనమైన
శౌరినింబోలెఁ గాంచిరి పౌరులెల్ల. ౫౮౭

౧౩. లండనువీడ్కోలు

ఆ.వె. ఛాత్రపుంగవుండు 'స్టర్డీ' మహాశయు
యాజమాన్యమునను యతివరునకు
వీడుకోలొసంగ విపులసన్నాహంబు
నాగరాళి యొక్కనాఁడొనర్చె. ౫౮౮

మ. కమనీయంబు వితానమంటప మలం
కారంబుఁ గావించి, ధూ
పములన్, దీపములన్, మనోహరముగా
భాసించి, పూఁదోరణాల్
ప్రముఖద్వారములందుఁగట్టి గొనుక సౌ
వర్ణాసనంబందు స్వా
మి మహోత్సాహతఁ గూరుచుండ సిడి రు
న్మీలింప హస్తధ్వనుల్. ౫౦౯

కం. విభవోపేతము, దివ్యం
బభూతపూర్వమగు నా సభాంతరమందున్
అభినందనపత్రంబును
సభాపతి పఠించె నిలిచి 'స్టర్టి' బుధుఁ డిటుల్. ౫౧౦

కం. "శ్రీమహనీయగుణా! ఉ
ర్వీమండలమండనా! వివేకానంద
స్వామీ! సర్వప్రేమీ!
గోమీ! గ్రహింయింపుమీ! యిదో! మా ప్రణతుల్. ౫౧౧

చ. దినదినవర్ధమానమయి
దిక్కుల శాఖలు విస్తరిల్లఁగా
ఘనముగ నేల వేరులు ది
గన్ ప్రబలంబగు మాదు సభ్యతాం

గొని తగ నాత్మవిద్యయను
గొడ్డలిపెట్టులువేసి చేసిఛే
దనమును, దివ్యజీవనర
థంబున కట్టెడలించి ఓ యతీ! ౫౯–౨

సీ. యుగయుగంబులనాఁటి; దనూహ్యమైన
యాదిగల దార్ష సంస్కృతి యార్యమిశ్ర!
'ప్రాఁతది పసిండి 'యను మేలిపలుకు మాకు
ననుభవమునకువచ్చె నీదైన దయను. ౫౯–౩

సీ. బుద్ధభగవాను నెల్లరు పూజసేతు
"రాసియా జ్యోతి" యంచు ; మహాత్మ! నీవు
శోభమానుండవల 'జగజ్జ్యోతి'నాఁగ
నగు స్వభావోక్తియిది; కాద యతిశయోక్తి ౫౯–౪

ఆ.వె. నేలవిడిచి సాము నెఱపుచు గడపైని
నెక్కి తాండవించు నీప్రజలకు
నీవు "బ్రహ్మవిద్య యిదిగాద" "యిది"యంచుఁ
దెలిపి గర్వముడిపితివి మహర్షి ! ౫౯–౫

కం. వడఁగొన్నయట్టి వారల
కెడసీరన జీవయాత్ర నెంతయుఁదాపం
పడు మాదృశులకు దేవా!
ఇడెఁ గడునూఱటఁ ద్వదీయహితబోధనముల్ ౫౯–౬

కం. నీనేలు మఱువఁజాలము
స్వామీ! కైకొంటి మమ్ము ఛాత్రులఁగా; మీ
భూమికి మాభూమికిసి
క్షేమంకర! కట్టినావు సేతువు నడుమన్ ౫౯-౭

గీ. లోకబాంధవు భాతి సుశ్లోక ! నీవు
పూర్వపశ్చాబ్ధిగోళముల్ పొందఁబెంపు
పిలిచి పర్యాయమున వాని వెలుఁగఁజేసి
తమముఁబాఁపుము దివ్యబోధమున సతము." ౫౯-౮

మ. పెనలుం బల్కు రోకల్లోకఘ్లుగ సభా
వేదీతటి న్నిల్చి " స్వా
మిరుణం బెట్టులుఁదీర్పఁజాల"మనుచున్
" మేమింక నేరీతిఁ దం
డిరినిం బాసినయట్టి యర్భకుల మా
డ్కిన్నుందు?" మం "చెల్లరుం
బరిదేవించుచు స్వామి నాఁపుఁ"డనుచున్
భాషించి రుదాబ్భష్పులై ౫౯-౯

చ. పలుకుచుఁ బల్కు చొక్కఁడు స
భాస్థలి నిల్చి యెలుంగు రాల్పడన్
బలుకఁగ రాక పైపలుకు
మానె సగంబున; నాఁచి యాఁచి యె

ట్టులో! యొకరుండు, వాక్కులఁగ
డుం దడఁబాటువహించు చోండు, మా
టలఁదునియించుకోం చోకఁడ
టన్ స్వకృతజ్ఞతఁ దెల్పిన త్తఱిన్ ౬౦౦

కం. ఒక కన్నానందాశ్రువు,
లోకకను దుఃఖాశ్రుకణము, లోలికింపంగా
సకలజనంబులు స్వామికిఁ
బ్రకటించిరి తమజోహా ర్లపారపుభ క్తిన్ ౬౦౧

సీ. తదభినందనపత్త్రి మాతఁడు గ్రహించి
సభ్యకరతాళనాదముల్ చదలుముట్ట
శాంతరసమొల్కుచున్న యాస్యమున నిలిచి
శిష్యవత్సలుఁడై వచించెను సమాధి. ౬౦౨

కం. అనుకొన్న ముహూర్తంబున
జనవంద్యుం డాంగ్లశిష్య సహితుండై త
న్ననుపఁగ వేవేల్పెద్దలు
వనధితటిన్నిలిచి నావపయిఁ బయనించెన్. ౬౦౩

సీ. పత్త్రికావార్తలం బట్టి స్వామిరాక
నెఱిఁగి యాసేతుహిమశైల భరతదేశ
మార్షధర్మసముద్ధర్తయైన యతని
కర్పణమొనర్పనుండె సుస్వాగతంబు. ౬౦౪

## ౧౮. సింహళ స్వాగతము

ఆ. వె. విజయభేరితోడ వేంచేయు యతి కర్ఘ్య
పాద్యముల నొసంగఁ బరమభక్తి
నోడరేవునొద్దఁ గూడిరి సింహళ
ద్వీపగతులు పెక్కు వేలమంది. ౬౦౫

మ. మినుముట్టంగను హర్షనాదములు స్వా
మిం దింపి; కైసేసి యా
యన కంఠంబును బూలమాలికలతో,
నర్పించి నీరాజనల్,
పెనువాద్యంబులు మ్రోఁగ బుష్పరథసం
విష్టున్ యతిం బుష్పతో
రణమార్గంబున వారు సేర్చిరి సభా
రంగోల్లసద్వేదికన్. ౬౦౬

కం. అనఘుం డలంకరింపఁగ
గనకమయాసనముఁ గురిసెఁ గల్పితసుమవృ
ష్టి నభంబునుండి వింతగ ;
జనకౌతూహలము పెరిగెఁ జాలక యెల్లల్. ౬౦౭

గీ. దివ్యలోకంబునుండి ధాత్రికిని దిగిన
దేవఋషి కట్లు ప్రజలు జేజే వఠింప
శాంతరసమును, బ్రహ్మతేజంబు మెరయ
వేయిసూర్యులపెట్టయి వెలిఁగె గద్దె. ౬౦౮

కం. హిందూప్రతినిధి యగు "ఆ
నందకుమారుండు" ముందునన్ నిలఁబడి యా
నందాశ్రువుల వివేకా
నందస్వామ్యంఘ్రులకుఁ బ్రణామ మొనర్చెన్. ౬౦౯

ఆ. వె. "స్వాగతంబు! స్వామివర! వివేకానంద!
స్వాగతంబు! నీకు జ్ఞానరాశి!
స్వాగతంబు! నీకు సర్వలోకారాధ్య!
స్వాగతంబు! నీకుఁ బారికాంక్షి! ౬౧౦

కం. స్వామీ! విశ్వమతసభా
ధామము శృంగమున నార్షధర్మపతాకన్
స్థేమమున నిలిపి పశ్చిమ
సీమ తలను వ్రాల్చి నీకు జేజేలయ్యా! ౬౧౧

గీ. ఓ మహామతి! యయ్యగస్త్యోదయమున
బురదవిఱిగినయట్లు నీపోకకతన
విఱిగి పాశ్చాత్యపాషండ వివిధమతము
లాసభం దేఱె జలమట్లు లార్షమతము. ౬౧౨

కం. మనలను బానిసలనుకొను
జనులను మనబానిసలుగఁ జలిపితి స్వామీ!
నిను గౌరవించుటనఁ జం
ద్రునకున్ నూల్పోగొసంగు త్రోవ యగుఁగదా! ౬౧౩

ఉ. ముప్పదిమూఁడుకోట్ల జన
ముల్ తలయెత్తి మనంగఁజేసినా ;
చెప్పుడు నీదుపేరు స్మరి
యించుకొనంగను జేసినావు ; క
న్విప్పొనరించి మోక్షపద
విన్ నడిపించితి వస్త్యథర్ములన్;
ఇప్పుడమిన్ భవాదృశుల
నెయ్యెడలం గనమైతి మోఋషీ! ౬౧౮

గీ. మన సనాతన మత ధర్మమునకు స్వామి !
నీవొనర్చిన మహనీయసేవఁ దలఁప
బదములు సమర్థములుగావు పలుకుటకును
వ్రాయుటకు ; మౌనమే సమర్థకము నిజము. ౬౧౯

కం. ఏతఁడు జననంబందుట
జాతిసమున్నతి వహింపఁజాలును భువి యం
దాతని జన్మమె సఫలము;
లాఁతులుగారే ? యజాగళస్తనసదృశుల్. ” ౬౨౦

చ. అనిపఠియింపఁగాఁబడిన
స్వాగతపత్రిక స్వీకరించి యా
యన కరతాళనాదనివ
హంబులు నింగినిముట్ట నిల్చి వం

దనములచేత వారికిఁ గృ
తజ్ఞతఁదెల్పి వచించెఁ దా "సనా
తనమత ధర్మదేవతదె
త్వత్కృతసత్కృతి"యంచు నమ్రుఁడై.

మ. మరియుం బల్కెను స్వామి "ఆర్షమతధ
ర్మంబుం గ్రియాశూరులై
చరియింపుండు! గ్రహించి సాంఘికదురా
చారంబులం ద్రోలుఁడీ!
పరిరక్షింపుఁ డనాథలోకముఁ గృపా
వచ్చిత్తులై నిచ్చ; లి
ద్ధరణిన్ మాధవసేనగాఁదలఁపుఁడీ!
తత్సేవ మోక్షార్థులై." ౬౧౮

కం. అతఁ డంతటఁ "బావనభా
రతవర్షము"గుఱించి కనులు రహిఁవిప్పి కనన్
శ్రుతపూర్వముగాని కథా
తతితోడ నుపన్యసించెఁ దత్రత్యులకున్. ౬౧౯

గీ. ఆ 'కొలంబో' పురమునుండి యతఁడు గదలి
"కాండి" 'జాఫ్నా'దులందు స్వాగతముఁగొంచు
దివ్యసందేశ మిడుచుండెఁ దీర్ఘసేవ
కట్లు తనుఁజూడవచ్చినయట్టి ప్రజకు. ౬౨౦

## ౧౯ భాస్కరసేతుపతి స్వాగతము

కం. అటనుండి స్వామి 'పాంబన్'
పుటభేదనమునకుఁ జనియె; భూనాథుం డా
దట "భాస్కరసేతుపతి" యు
చటఁ బ్రతిపాలించుచుండెఁ సందర్శింపన్. ౬-౨౧

మ. అతఁ డాస్వామిపదాంబుజంబులకు సా
ష్టాంగప్రణామంబు లా
యతభక్తిన్ సవరించి యిచ్చియును బా
ద్యార్ఘ్యంబు, లర్పించి హా
రతి, నాసీనునొనర్చి యాత్మశకటీ
రాజంబుపై, లాఁగె నూ
డ్చి తురంగంబుల రాజవీథిఁబడి "జే
జే స్వామి"కం చాటుచున్. ౬-౨౨

గీ. రామలింగేశ్వరస్వామి స్వామివరుఁడు
దర్శన మొనర్చి యాత్మసందర్శనమున
కరుగుదెంచిన భక్తసంప్రార్థితుఁడయి
భక్తియోగంబుగుఱించి యుపన్యసించె. ౬-౨౩

గీ. "తీర్థమందురు తత్త్వోపదేశనమును,
దదుపదేష్టను; నిలను దత్ప్రాప్తి పొంద
దేశదేశంబులందు యాత్రింపవలయు;
నతఁడు హిమమును రవివోలె నఘము లడఁచు. ౬-౨౪

ఆ.వె. భక్తిలేనిపూజ పత్రిచేటందురు;
పత్రిపూజ సలుపవలయు భక్తి;
హృదయసరసిజమున నీశ్వరార్చనసేత
యుత్తమోత్తమంపు బత్తి సుండు. ౬౧౫

కం. గుడిలోపలివిగ్రహమే
యెడఁదను భ్రమియింపవలవ దీశ్వరుఁడని; యా
తఁడు పడుగుపేకలై యొ
ప్పెడుఁ దరతమభావముడిగి విశ్వమునందున్. ౬౧౬

కం. విరిదండ బొందువలె నీ
శ్వరుండు భాసిల్లు జీవజాలమునఁ, దదీ
శ్వరు సేవింపుఁడు దీనో
ద్ధరణద్వారమునఁ జూపి త్యాగము సతమున్. ౬౧౭

గీ. సకలకాలంబహో ! దురాచారములనె
సలుపుచు జనుండు దీర్ఘయాత్రలకు వెడలుఁ;
గడుగఁజాలవు జలములక్కల్మషములఁ
గాలు నను తాపతప్తుండు గా నతండు." ౬౧౮

ఆ.వె. ఇట్లు బోధసేసి యెలమిఁగొల్పిన స్వామి
బ్రీతిగొలుప నాఁడు సేతుపతియు
నన్నవస్త్రదాన మాచరించెను; బీద
సాదు లెదిగినట్లు మోదపడిరి. ౬౧౯

సీ. సేతుపతిరాజు శ్రీస్వామి మాతృభూమి
నడుగుపెట్టిననాఁటి చిహ్నముగఁ బెద్ద
ప్రస్తర స్తంభ మొండు నిర్మాణపఱచి
యందుఁ జెక్కించె నీ క్రింది యక్షరములు. ౬౩౦

మ. " అనవద్యుండు ప్రతీచ్యఖండము వివే
కానందుఁ డుద్బోధఁ బా
వనముం జేసి సనాతనార్ష మతముం
స్థాపించి సౌభ్రాత్రముం
బెనుపొందించి, సశిష్యుఁడై భరత భూ
మిం డిగ్గి మున్ముందుగాఁ
దనపాదార్పణముం బొనర్చిన పవి
త్రక్షేత్ర మీసీమయే. " ౬౩౧

ఆ.వె. రామనాథనగరరాజు భాస్కరసేతు
పతిని ననుగమించి స్వామి సభను
స్వాగతము గ్రహించి స్తవియించె 'రాజర్షి'
యంచు ధర్మరతుని నతనిఁ బెద్ద. ౬౩౨

ఆ.వె. మహితుఁ డతఁడు వెడలి మధురను, తిరుచ్చినా
పల్లి, కుంభఘోణపత్తనములఁ
గనుచు, స్వాగతములు గొనుచుఁ జెన్నపురంబుఁ
జనుచునుండె ధూమశకటిపైని. ౬౩౩

ఉ. స్వామిదిదృక్షమాణజన సంఘ
మొకానొకస్టేషనొద్దఁ ద
త్స్వామిని రైలునాఁపుమని
ప్రార్థనఁజేసి, వృథాశులై క్షణం
బేమియుఁదోఁచకుండి తుది
నెల్లరు నిస్పృపటాలబద్దెలం
'దేమయినన్ సరే' యని శ
యించిరి పెద్దశరించి యత్తఱిన్. ౬౩౪

ఆ.వె. దూరదర్శియైన ధూమశకటయంత
బండినాఁపఁ, గనులపండువుగను
దర్శనంబొనర్చి తండోపతండముల్
ప్రజలు గొనిరి స్వామిపాదధూళి ౬౩౫

కం. ఆశీర్వదించి, ధర్మ
ప్రాశస్త్యము, దుర్గతోద్ధరణమును దగ ను
ద్దేశించి కఱచె స్వామి ; హృ
దాశ ఫలించుటను వారలరిగిరి ప్రీతిన్. ౬౩౬

మ. భగవానుండగుస్వామిరైలు పట "నాఁ
పంజాల"నం చెంతయుం
బొగరుంబోతయిపల్కు 'మాస్టరు' మహా
మూఢుండు దర్శించి కే

ల్లాగి చేరె స్వామికి ; నా ప్రజంబలికె
"మీ పుణ్యాన నేఁగంటి శ్రీ
భగవత్పాదుని ; దోషి నైతి మొదటం ;
బ్రార్థింతు" నంచుఁ దగన్. ౬౩౭

## ౨౦ చెన్నపుర స్వాగతము.

గీ. స్వర్గపురలక్ష్మి ధర్మదేవతకుఁ బోలెఁ
జెన్నపురలక్ష్మి యాఁగాగ్ని సన్నిభుఁ డగు
స్వామి కాతిథ్యమర్పింప సజ్జితయయి
చెలువుమెయినిల్చె "ఎగ్మోరుస్టేష" నందు ౬౩౮

కం. పురజను లెల్లరుఁ దమ హ
త్తురంగమంబులనుగట్టి తోడ్కొని వెసఁదె
చ్చిరి తద్వాళంబమోర్వక ;
యరుదెంచెను రైలు జయజయధ్వని చెలఁగన్ ౬౩౯

ఆ.వె. త్రొక్కుకొంచు నొండొరులఁ ద్రోసికొంచును
స్వామిగూరుచున్న బండి డాసి
ప్రజలు గర్భగుడినిఁ బరిఢవిల్లెడు వేల్పు
భాతి మెరయుచున్న వానిఁ గనిరి. ౬౪౦

కం. తోమాలెఁబోని చక్కని
పూమాలను జారుకంఠమునఁ దొడుగంగా
దామోదరుఁడై మెరసిన
స్వామికిఁ బాద్యార్ఘ్యములను సలిపిరి పూజల్ ౬౪౧

సీ. ' జయ ! వివేకానంద ! జయ ! రామకృష్ణ శి
ష్యాగ్రగణ్యా ! స్వామి ! స్వాగతంబు "
" జయ! సనాతన ధర్మ సంస్థాపనాచార్య !
జయ ! విద్వదగ్రణీ ! స్వాగతంబు "
" జయ ! విశ్వమతసభాజయపట్టభూషణ !
జయ ! పుణ్యపూరుషా ! స్వాగతంబు "
" జయ ! భారతీయ యశశ్చంద్రికా చంద్ర !
జయ ! దీనసేవకా ! స్వాగతంబు "

గీ. స్వస్తి! భువనేశ్వరీ పుణ్యభాగ్యమూర్తి !
"స్వస్తి ! శ్రీ విశ్వనాథార్య వంశరత్న ! "
అని పతాకితమగు తోరణాఢ్యమందుఁ
బ్రజలు మెరవణ్ణి నడిపింప స్వామివెడలె. ౬౭౯

కం. పునరుక్తపదాభాసము
లనఁదగె జయజయరవంబు, లాయతివర ద
ర్శనములును, వానిమృదుభా
షణసంశ్రవణములు, నాప్రజాస్తోమములోఁ. ౬౭౭

కం. స్వకళాశాలసమీపము
నకురాఁగ మహోత్సవము ప్రణతులిడి విడి త
చ్ఛకటాశ్వంబుల లాగిరి
స్వకరంబుల 'జే'యటంచు బాలురు స్వామిన్. ౬౭౭

ఆ. వె. అడుగులంటి, కావిమడుఁగు గండ్లకునద్ది;
తోడనడచి, పాదధూళిఁదాల్చి,
గాలిదాఁకుఁగోరి, కడిఁది సేవించిరి
చిన్న పెద్దలెల్లఁ జెన్నపురిని. ౭౮౫

మ. నవరాత్రంబులు చెన్నపత్తనమునన్
వాసించి కావించె శి
ష్యవరప్రార్థితుఁడై యపూర్వ ముప
న్యాసంబులన్ స్వామి " హైం
దవవేదాంతులు"; "భారతర్షితతిఁ"; ప్ర
త్యక్షమ నాయుద్యమ
పువిధానంబు"ల "భావిభారతపథం
బుం"గూర్చి రుచ్యంబుగన్ ౭౮౬

గీ. చెన్నపురమందు స్వామి యున్నన్నినాళ్ళు
ప్రజకుఁ దిరునాళ్ళయయ్యెను; స్వామికథయు
రామకథయయ్యె నదసీయరమ్యమూర్తి
శ్రీసదాశివమూర్తియై చిత్తమెక్కె. ౭౮౭

గీ. ధర్మశాస్త్రోక్తసన్న్యాసిధర్మముల న
తండు పాటింపఁడఁట; నిషిద్ధము సముద్ర
యానమొనరించెనంట; యయ్యఘము మోఁపి
తెగడికొనుచుండి రచటి శ్రోత్రియులు వాని. ౭౮౮

మ. తిలకోపాహ్వుఁడు, లోకమాన్యుఁడు, మహా
ధీ బాలగంగాధరుం
డలస్వామిం దనపుణ్యపత్తనమునం
దర్శించి సందేశవా
క్కుల నాలింపఁగఁజేయ రాష్ట్రీయులకు
త్కంఠయ్యె; నాకోర్కె ని
ష్ఫలమయ్యెన్ గాసిలేమి స్వామికిఁ దదా
హ్వానంబు సెల్లింపఁగన్. ౬౪౯

ఆ.వె. లోకమాన్యుఁడతఁడు; లోకమాన్యుఁడితండు;
నొండొరువుల కెడఁదనుండెఁ బ్రీతి;
కర్మయోగి యతఁడు; జ్ఞానయోగి యితండు;
క్షేమకరులె జగతికిని నిరువురు. ౬౫౧

ఆ.వె. పలవరించుచుండె స్వసుతరత్నము, లోక
రత్నమైన స్వామి రాకకొఱకు
వంగదేశమాత పవలును రేయియుఁ
గనుచునుండె దారి దినదినంబు. ౬౫౧

ఆ.వె. చెన్నపురికి స్వామి చేరిన ట్లాలింప
నారటంబు హెచ్చె నతనిఁ గాంచఁ;
బ్రియజనంబు దగ్గఱించినకొలఁది సం
బంధిహృదయ మక్షమత్వ మొందు. ౬౫౨

## ౨౮. కలకత్తా స్వాగతము

కం. కలకత్తానగరమునకు
వెలల బయలుదేరు (శ్రీ) వివేకానందుఁ
జలనిధి తలపైఁదాలిచి
కొలువరిచందమున మోసికొనిపోయెఁ దగఁ ౧౫౩

మ. అలదర్భాంగ మహామహీంధవుని యా
ధ్యక్ష్యంబునం బెద్ద పె
ద్దలతోఁ స్వాగతసంఘమేర్పడియె ; ప్ర
స్థానించి మున్ముందు స
భ్యులు ప్రద్యుద్గమియించి పానసపదం
బుల్ మ్రొక్కి యయ్యోడ దిం
పి లలిం దెచ్చిరి వేఱు రైలుపయి స్వా
మిన్ వంగభూభాగ్యమున్. ౧౫౪

ఆ. వె. వేచియున్న వేలవేలజనం బైక
కంఠ్యమను జయప్రకారరవము
ప్రీతి వంగ జనని వేనోళ్ళఁ దదభినం
దన మొనర్చునట్లు దనరె నపుడు. ౧౫౫

మ. తను, శుభ్రాంశుని నాచకోరముల చం
దానం బ్రతీక్షించు వా
రి నమోవాకములం గడుందనిపి త
ప్రేష్ఠుండు వార్వారు వే

సినపూడండలరాసి మున్గి విజయం
చేసెం బ్రబ్యోలీముఖం
బున సౌధస్థపురంధ్రు లాదట
మెయిం బుష్పంబులం జల్లఁగన్. ౬౫౬

గీ. ఆంగ్లశిష్యసమేతుఁడై యరదమందు
వచ్చుస్వామిని దరిసించి పౌరజనులు
సపరిజనముగ నూరేఁగు శంకరునకుఁ
బగిది గొబ్బుండ్లుఁ, బూలు, నివ్వాళులిడిరి. ౬౫౬

ఆ. వె. ఆఁపి స్వామిరథము నచట మధ్యేఽధ్వము
తురగములను విప్పి త్రోలి దవ్వు
జనులు లాగినారు 'జైస్వామి' కనుపల్కు
భూనభోంతరముల బోరుకలఁగ. ౬౫౭

ఆ. వె. స్వామి యుత్సవంబు సాఁగిన రథ్యలో
నేల రాలినట్టి పూల నేటి
నేత్రములకు నద్ది నిర్మాల్యముగ నెంచి
పౌరజనము శిరసుపైనిఁ దాల్చె. ౬౫౮

మ. చనుచుం దోరణాలం, బతాకలను, భా
స్వంతంబుగా నున్న ర
థ్యను వాద్యధ్వని పిక్కటిల్లఁగ వివే
కానందుఁడానాఁటి యు

ద్రినికాయంబు గురుత్వరంపర సము
త్కృత్తంబుఁ గావించి వ
చ్చిన వాస్తోష్పతినిం దలంపునకుఁ జె
చ్చెం దద్విజశ్రేణికిన్. ౬౬౦

కం. జనులెవ్వరుఁ గనివిని యెఱుఁ
గని స్వాగత సభను స్వామిఁ గాంచనపీఠం
బున నునిచి పుష్పవృష్టి న
తనిపైఁ గురియించి స్వాగతముఁ జదివిరిటుల్. ౬౬౧

గీ. "స్వాగతము! రామకృష్ణ శిష్యాగ్రగణ్య!
వంగ జననీ శిరోరత్న! స్వాగతంబు!
భారతజ్యోతి! కైమోడ్పు స్వాగతంబు!
వైదికమతోద్ధరణ! యిగో! స్వాగతంబు! ౬౬౨

గీ. "ఇది మహోదయంబ" "యిద్ది బ్రహ్మోత్సవం"
"బిదియె విజయదశమి యిలకు" ననిరి;
సర్వపర్వములును స్వామి మొత్తంబయిఁ
కూడినట్లు మాకు నేఁడు దోఁచె. ౬౬౩

కం. ధరియించినావు స్వామీ!
నరేంద్రనామంబు చిన్ననాఁ; డది యయ్యెం
బిరు దపుడు నిపుడు; పొగడం
దరంబె? త్వత్పితృసుదీర్ఘదర్శిత్వ మిలన్. ౬౬౪

ఆ.వె. ఆఱిపోవనున్న యార్షధర్మజ్యోతిఁ
జమురు నింపి లెస్స శతసహస్ర
భానుదీప్తి వెలుఁగు దానిచే నెల్ల ఖం
డముల యిరులఁ దోలఁచినావు స్వామి! ౬౬౫

గీ. రత్నగర్భాహ్వయంబు సార్థత వహించె
స్వామి! సుతరత్నమైన నీ జన్మమునను;
'మాతృదేవో భవ' యటన్న మాట నిలిపి
తివి భరతమాత ఋణమును దీర్చివైచి. ౬౬౬

గీ. రాష్ట్రముల నీకతన వంగరాష్ట్ర మలరె;
దేశములయందు భారతదేశ మొప్పె;
ఖండములయందు 'ఆసియాఖండ'మమరె;
"అత్యతిష్ఠద్దశాంగుళ మ్మ"నఁగ స్వామి! ౬౬౭

ఆ.వె. మా సహోదరుఁడవు; మా సహాధ్యాయివి;
మా సఖుండవ; వింక మా గురుండ;
వాక్కులేమి? స్వామి! నిక్కంబు మాకేమి
కావు? నీకు నేమి కాము మేము?" ౬౬౮

గీ. సభ్యపక్షంబునఁ బఠించి స్వాగతంబు
రజతపేటిక నిడి సమర్పణ మొనర్ప
స్వామి తదనుగ్రహార్థంబ సంస్పృశించె;
ధన్యవాదంబులు వినయత్పథంబు నంటె. ౬౬౯

ఆ.వె. అంత స్వామి లేచి హర్షధ్వనులతోడఁ
దన కృతజ్ఞభావమును వచించె
మొగిచి కేలుదోయి దృగమృతపూరంబు
సభ్యజనము మీఁద జాలువాఱ. ౬౨౦

మ. 'ఎవరెస్టు' శృంగముకన్నఁ దుంగమునుఁడీ !
హిందూమతం బొంపె; యి
య్యవనిం; గన్పడ రాత్మదర్శనముకై
యంతంత యత్నించిన
ట్టి వివేకుల్ మననేలఁ దక్క, 'నహి' చుం
డీ ! యార్షధర్మంబుక
న్న విశాలంబు సహిష్ణువైన దొకఁడ
న్యం బీ ప్రపంచంబునన్. ౬౨౧

కం. శ్రుతియుక్త్యనుభవముల నీ
మతంబె స్థాప్యంబు; లాఁతిమతములు గావీ
క్షితి; మన కుపదేశింపఁగ
నితర మతాచార్యవర్గ మేమి యెఱుంగున్? ౬౨౨

కం. మన కెద్ది హేయమో ! దా
ని నుపాదేయముగ మది గణించు ప్రతీచ్యుల్
మనకుం గఱపెడివారఁట!
జనుపాంధులు చూపఁగలరె సరియగు బాటన్? ౬౨౩

ఆ.వె. ఒక్కయూరి కొప్పుచుండు వేత్రోవలు;
దనరు నందు సత్పథంబొకండె;
ముక్తికున్న మార్గముల నార్షమార్గంబె
యుర్వియందు నుత్తమోత్తమంబు. ౬౭౪

కం. మనల సనాతన సంస్కృతి
యనుదార, మనుత్తమంబు, నని పొగడికొనం
బని తీఱునె? యౌషధగుణ
మును వర్ణించిననె రోగము ప్రశాంతిలునే? ౬౭౫

కం. "సకలంబు బ్రహ్మమయ" మని
శుకానువాదంబొనర్చి సూరులు గడు జా
తి, కుల, తరతమత్వంబులు
ప్రకటించుచు; సందొసంగెఁ గ్రైస్తవుల కిదే! ౬౭౬

కం. కులతారతమ్యరాహువు
గళంబు వెల్వడిన గాని కనఁబడదు సుఁడీ!
ఇలవేరికినిన్ బ్రహ్మము;
కలుగదుగద! మోక్షమపుడుగానియరయఁగన్. ౬౭౭

ఆ.వె. వట్టిసాంఘికములు వర్ణధర్మంబులు;
కావు పారమార్థికములు దలఁప;
ఆకు నాకుచుండి రవివేకులై బెల్ల
మవలఁ బాఱవైచి యవనిజనులు. ౬౭౮

సీ. తల్లి రోసిన పిల్లను దాదిరోయు ;
బ్రాహ్మణుఁడుదాఁకకున్న నెవ్వండు దాఁకు ?
మాలనింగాంచి రోసి బాడాలకేఁగ
నీశ్వరుఁడు వాని బాడాలకేఁగఁడేమి ? ౬౭౯

ఆ. వె. వాదులాట వలదు పరమతస్థులతోడ ;
నెవరిత్రోవ వారినేఁగ నిండు ;
ఆత్మరక్షణార్థ మాయత్తులరగుండు ;
రమ్మనుండు వారు రాఁదలంప." ౬౮౦

కం. అనిమరియు 'షికాగో' పుర
మునుపన్యాసముల సారమును, దద్దేశం
బునఁ దనపూనిన యుద్యమ
మును బూసంగ్రుచ్చినట్లు బోధలొనర్చెన్. ౬౮౧

## ౨౨. 'రామకృష్ణ సేవా' సంఘస్థాపనము

కం. తరువాతఁ గొలఁదినాళ్ళకు
జరిపించెను రామకృష్ణ జన్మోత్సవ మే
గురువున కేశిష్యుండును
జరిగింపనిపగిది లోకసంస్తుత్యముగన్ ౬౮౩

కం. మతసామరస్య పూర్వము
క్షితివేదాంత ప్రచారకృత్యము, దీనో
ద్ధృతి, దేశీయపరిశ్రమ
తతివృద్ధియు, సంస్థ ముఖ్య ధర్మములయ్యెన్. ౬౮౪

ఆ.వె. సూత్రములకు వ్యాఖ్యచొప్పున నిమ్మాఁడు
ధర్మములకు వివృతి దద్దఁజెరిగెఁ ;
త్యాగసేవలే ప్రధానంబు ; శుద్ధస
న్న్యాసివరులె దానినడపువారు. ౬౦౫

మ. నిగమాంతంబుల నాత్మమోక్షణమె వ
ర్ణింపంబడెన్ లక్ష్యమై ;
తగ నీసంస్థకు దీనమానవసము
ద్ధారంబు వేఱొండు రెం
డగులక్ష్యం ; బదె యార్షధర్మమగుఁ ; గ
ణ్యాదుల్ స్వమోక్షార్థు లి
వ్వగ దుఃఖార్తశకుంతలాదులకు సే
వల్ సేసి రక్షింపరే ? ౬౦౬

## ౨౩. స్వామి దివ్యానుభవములు

ఆ.వె. దాని దీనిఁగూర్చి తన్నుఁబ్రశ్నించెడు
వారలకు వచించు స్వామివరుఁడు
స్వానుభూతు లప్పుడప్పుడు ; శంకింప
వలనుగాదు ; నమ్మవలయు వాని ౬౦౭

గీ. "అమెరికాఖండమున నొక్కయంబుజాక్షి
నిండుఁబ్రాయంపుఁజిన్నది ; నే వచింపఁ
గృష్ణకథ విని యెడఁద రేకెత్తఁ బత్తి
విడిచి సర్వస్వ మొక్కదీవినిఁ దపించె." ౬౦౮

మ. "ఎలప్రాయంబునఁగామ పీడ పడ లే
కిద్దానినిన్ మించు బా
ధ లభింపం బ్రశమిల్లు నిద్రయని ని
ర్దగ్ధజ్వాలత్వేదినీ
స్థలిఁ గూర్చుంటిని ; మాయమయ్యె స్మరసం
తాపంబు; నేఁ బొందితిన్
బలవద్బాధను బుండువాఱుట నితం
బద్వంద్వ మార్గాసముల్." ౬౮౯

ఆ. వె. "పెక్కుచోట్ల నాకుఁ బెనుపిశాచంబులు
కానిపించి నన్ను దీనముగను
గాంచుచుండ వానికథ నెఱింగి విముక్తి
కోఱకుఁ బ్రార్థనములు జరిపియుంటి." ౬౯౦

ఆ. వె. 'అమరనాథ' శివుని నర్చించు నాకు సా
క్షాత్కరించి కని ప్రసన్నదృష్టి
సంస్పృశించి శిరసు "స్వచ్ఛందమరణంబు
గలుగు నీ" కటంచుఁ బలికి పోయె. ౬౯౧

మ. "గుడినింగూల్చిరి క్రూరకర్ములు దురు
ష్కుల్; 'దేవి మైలయ్యె' నం
చెడ క్షోభిల్లుచునుండ నొక్కయెడ నే
నెందుండియో వింటి ని

నుడువుల్; " నీదగు కొంపగూలినటులన్
దుఃఖింతు; వేమయ్యె? నా
కెవరే? మెవ్వఁడు బ్రోఁచు వాఁడు? నను ని
స్సీ! నీవు రక్షింతువే ?" ౬౯—౨

గీ. క్షుద్రదేవతావిష్టుఁడో కోపగుఁడువుఁ డోకటఁ
గడిఁది జ్వరతాపమునఁ గేకలిడుచుఁ, బఱచు,
చెగురుచును, సొమ్మసిలుచుండ, నే స్పృశింప
వానియాదల, ద్రుటిలోన స్వస్థుఁడయ్యె. ౬౯—౩

కం. మఱునాఁ డట నేని సభాం
తరమందు నుపన్యసింపఁ దలఁచిన విషయం
బఱిఁదిగ నారాతిరి యె
వ్వరో? నాకుంగఱపుచుండ్రు స్వప్నంబులందున్. ౬౯—౪

చ. అలసటఁ జెంది కూలఁబడి
నప్పుడు బోటను, జింకిపాఁతయుం
గలుగని వేళఁ గప్పుకొన,
నాఁకట నేలనువ్రాలి సత్తఱిం
బలము నొసంగి గాత్రమున,
బట్టను బైఁబడవైచి, కూర్మి ని
చ్చలమగు చద్ది చేతికిడి
సాఁకె మహాత్ముఁ డెవండొ? యాత్రిలన్

కం. జ్వరితుండయు శిష్యుండొక్కఁడు
మునుఁగ సన్ముఖుఁడైనతఱి నమఃపూర్వముగా
గురుదేవు నస్థితీర్థము
శిరసునఁ బ్రోక్షించి ప్రాశనఁ జేసితి; బ్రతికెన్. ౬౯౬

కం. ఒకని మొగంబును గనఁగనె
సకలంబగు ప్రకృతియగును సాక్షాద్భూతం
బు కథామృతకంబున రా
మకృష్ణుని యనుగ్రహము సమగ్రము నాపై. ౬౯౭

## ౨౪. శిష్య సన్న్యాసదీక్ష

గీ. తన మఠంబునఁ దనబోధ లనుసరించు
చుత్తమబ్రహ్మచర్య సముజ్జ్వలులగు
నాత్మశిష్యుల కతఁడు సన్న్యాసదీక్ష
శాస్త్రవిధి నిచ్చి యిట్లు శిక్షణ మొనర్చె. ౬౯౮

ఆ. వె. "మీర లింతదనుక దూరస్థులయి లోక
మునకు జపతపముల మునిఁగి సతత
మాత్మమోక్షమునకె యారాటపడుచుంటి;
రింకనలయు లోకహిత మొనర్పు. ౬౯౯

కం. గురుదేవుఁడు వాక్రువ్వఁడె ?
దరిద్రనారాయణులను దమి సేవింపం
భిక్షువీకను బుట్టఁగ వే
మఱు లేనియు జ్ఞానమయ్యు మహిమం దనుచున్.

గీ. జాతిమతభేదములు ద్రుంచి సతము మీరు
గ్రుడ్డివాండ్రకుఁ గన్నులై, కుంటివాండ్ర
కడుగులై, క్షుధార్తుల, కామయావితతికి,
నన్నమై, యౌషధంబయ్యు నోపవలయు. ౨౦౧

కం. నెలకొలుపుఁడన్నసత్రం
బులు, విద్యావైద్యశాలములు భైక్షముచేఁ;
గొలువవలె సర్వథా పతి
తులఁ; దమ్ములనలె సముద్ధృతులఁ జేయవలెన్. ౨౦౨

గీ. మాతృగమనాదులగు మహాపాతకముల
కర్తయైనను మన కనుకంపనీయు ;
లవని ననుతాపవహ్ని దాహంబొనర్చి
స్వర్ణమునుబోలె వానిఁ బావను నొనర్చు. ౨౦౩

కం. ప్రతివానియందుఁగల ని
ద్రితశక్తిని మేలుకొలిపితిరయేని క్షితిన్
అతఁడు హనూమంతుండయి
ప్రతిరోధములేని వీరవరుఁడై పొలుచున్. ౨౦౪

ఆ.వె. కడుపు గాలుచుండఁ గావలె నెవనికి
ధర్మబోధ? లౌషధమునఁ గాక
శాంతపడునె? తీవ్రసన్నిపాతవ్యాధి
పూయుఁ జందనంపుఁబూఁత పైని. ౨౦౫

ఆ.వె. "కర్మబంధకంబుగాదె ? మోక్షార్థికి"
నంచు మీరు సంశయించుచుంద్రు ;
ముక్కుమూసికొనియె మునులు గూర్చుండిరే ?
చేయరైరె లోకసేవ వారు ? ౨౦౬

ఆ.వె. స్వసుఖపరభిలాష భాస్కరుండటు లోక
బాంధవులుగ మెలఁగవలయు మీరు;
గాలకూటమట్లు కామినీకాంచనం
బులను దొలఁద్రోయవలయుఁ జుండు ! ౨౦౭

ఆ.వె. కోసివేసి మమతఁ, ద్రోసివేసి యహంత
మానవాళియెల్ల మాధవులని
నీచమనక దేశసేవఁ గార్యంబును
సలుప నుత్సహింపవలయు ! వినుఁడు ! ౨౦౮

సీ. కాదు ! మన లక్ష్య మాత్మమోక్షం బొకండె
లోకమోక్షంబుగూడ నాస్మాకలక్ష్య;
బుద్ధి వెలియైన యాత్మమోక్షేచ్ఛ దగదు;
పరులు పస్తుండఁ దాఁదింట భావ్య మగునె ; ౨౦౯

మ. తమప్రారబ్ధఫలం బవశ్యమనుభో
క్తవ్యమ్మటం చార్తబృం
దము నీక్షింపనివా రపండితులు స
న్న్యాసిబ్రువుల్ చుండి ! యా...

న్రవుతాదర్శము రామకృష్ణగురు భా
ష్యం బిద్దిగా ; దాత్మమో
క్షముతో పాటు యతింపఁగావలె జగ
త్కల్యాణ కార్యార్థమై. ౨౦౦

కం. యములగు నస్మాదృశులే
యమోఘముగ నిర్వహింప నర్హులు పైకా
ర్యములను ; గృహి సంసృతి పం
కము నుండి పదంబుఁ గదపఁగాఁజాలఁ డయో!" ౨౦౧

సీ. ఛాత్రు లుపదేశములు శిరసావహించి
వ్రాల నడుగుల దీవించి స్వామిపలికె
"చేరితిరి మీరు జీవితశిఖరమునకు ;
ధన్య మీమాత ; మీజన్మధన్య" యంచు. ౨౦౨

కం. పదఁపడి సుగ్రీవాజ్ఞగ
నెద గురునానతిఁ దలంచి యేగిరి శిష్యుల్ ;
మొదలిడిరి నాఁటినుండియె
వదలక తూచా లొనర్ప స్వామివచనముల్. ౨౦౩

సీ. అలసి వేదితతో 'జోసఫైను' కాంత
'ఓలిబుల్' సతి, 'మెక్లౌడు' యువతి, 'ముల్ల'
రంగనయు బ్రహ్మచారిణులయి సురాప
గాతటిఁదపింపఁజనిరి దీక్షనువహించి. ౨౦౪

గీ. తీక్ష్ణతపములనేని సాధింపరాని
యాత్మసాక్షాత్కృతి లభించె నాసతులకుఁ
దనదు గురుదేవుఁడిడిన చందమున స్వామి
తనదు కరపంకజమును నెదలను దాఁక. ౨౦౫

ఆ.వె. వచ్చికర్మఠుండు స్వామిఁబృచ్ఛించె "న
స్పృశ్యులగు ప్రతీచ్యశిష్యుల కెటు
నీవు బ్రహ్మవిద్య నేర్పితి? వారిసోఁ
గలిసి కుడుతువిద్ది కాదె దోసఁగు? ౨౦౬

కం. ఇతరులనుకొందువసియును
మదిఁదలఁపక యాంగ్లయువతిమండలిసోఁకన్
సతతంబుఁ జరింతువు 'మిం
డతపసి' యను బిరుదు నీకు న్యాయము దాల్పన్". ౨౦౭

ఆ.వె. అనుడు స్వామి యనియె "నార్య! యియ్యదని నె
వ్వాని సొత్తముల్లె బ్రహ్మవిద్య?
చేరి కోరినట్టి జిజ్ఞాసువుల కెల్లఁ
గాదు నాక కఱపఁ గడఁగవలయు. ౨౦౮

కం. మడుఁగేమిటి? మైలేమిటి?
పుడమిని సన్న్యాసులకు; నపుణ్యులనే నీ
తఁడు తాఁకులఁ బుణ్యులఁజే
యఁడె? చేయండేని నెట్లు యతియనఁబరగున్? ౨౦౯

కం. లోకము మాయఁగ గలదే?
మూకుడు; క్షుద్రులగు కోటిమూఁకల యుఱుపుల్
గైకొనము; ధర్మ్యమార్గము
నేకరణిని విడువఁజాల నేలా పెక్కుల్?" ౭౨౦

కం. ఒకనాఁడు స్వామి (శ్రీ) రా
మకృష్ణమఠసృష్టిసేయ మదిఁదలఁపఁగఁ గాం
చ కహంప్రథమిక నిజ శి
ష్యకోటి గావించె సిద్ధ సంకల్పునిఁగాన్. ౭౨౧

ఆ. వె. నామశేషుఁడయ్యె రామకృష్ణుఁడు మహా
కృతివహించి మానవృత్తిఁ బూనె
శిష్య శిక్షణంబు; సిద్ధులు మరణింత్రె?
అపరమూర్తిఁదాల్చి యవగింత్రు. ౭౨౨

కం. గురుకులవిధానమున నే
ర్పఱచి కళాశాల శిష్యవర్గంబునకుం
గఱపుచుఁ, గళ, లాగమములు
జరిపెను గాలంబుఁ గొంత స్వామి మఠమునన్. ౭౨౩

గీ. అమరనాథాదులయిన క్షేత్రములఁ గాంచు
తమినిఁబయనించి దేశదేశములయందు
స్వాగతంబులు గొంచు స్వభక్తతతికి
ధర్మశిక్ష నొనర్చు చాతండు దిరిగె. ౭౨౪

## ౨౫. ద్వితీయ 'అమెరికా' ప్రయాణము

ఆ. వె. తన్ను నమెరికకును దయచేయుమని రాఁగ
విన్నపంబుపైని విన్నపంబు
శిష్యవత్సలుండు, శ్రేయోభిలాషి; జ
జ్ఞానదీప మతఁడు చనియె మరల. ౭౨౫

కం. తనతన సమీపమందే
జనకుండు వసింపవలయు నని పుత్త్రుఁడు గో
రిన, నాతఁ డెల్ల పుత్త్రిక
లను బర్యాయమునఁ గాంచి లాలించుఁగదా ! ౭౨౬

సీ. స్వాగతములంది స్వామి 'న్యూయార్కు' పురినిఁ
బోయి యచ్చటనుండియుఁ గాలిఫోర్నియాకు'
'లాసు ఏంజిల్సు' నకు ''ఓకులాండు'' నకును
నటు నిరాఘాటముగ నుపన్యాసములను. ౭౨౭

కం. స్థాపించి గరువి వేదాం
తోపన్యాసముల విని యుపాసకులు ! 'సమితుల' నా
నా పత్తనములఁ బొసఁగ
దీపి వసింపంగఁ దదుప దేశములందున్. ౭౨౮

కం. దినదినము నుపన్యాసము,
దినదిన మభిలాషి శిష్యదీక్షాదానం
బనుదినము సంఘసంస్థా
పనయాత్రలు; లేదు తీరుబడి స్వామికటన్. ౭౨౯

కం. చెఱకును బిండిన కరణి న
మెరికా దేశజులు స్వామి మిక్కిలియును బిం
డిరి; యఱిది రసముమాత్రము
తలుగక చిప్పిల్లె ధారధారలుగాఁగన్. ౨౩౦

ఆ. వె. స్వామి విడువరైరి పౌరులు; వారిని
స్వామి విడువఁడయ్యెఁ బగలు లేదు;
రాత్రి లేదు; నిద్దురయు లేదు; శృంఖలా
బద్ధు లట్టులుండ్రు వారు సతతము. ౨౩౧

ఆ. వె. బ్రహ్మచర్య పట్టభద్రుఁ; డస్ఖలిత తే
జస్కుఁ, డవని భీష్మసదృశుఁడైన
స్వామి యొక్కనాఁడు బ్రహ్మచర్యముఁగూర్చి
వైద్యరాజసభ నుపన్యసించె. ౨౩౨

ఆ. వె. "బ్రహ్మచర్య మిలను బ్రకృతివిరుద్ధమం"
చన్న మీదువచన మర్థశూన్య;
మున్నవారు వేగు రూర్ధ్వరేతస్కులు
భరతదేశశైల వనము లందు. ౨౩౩

కం. వినియే యుండెదరు మీరలు
మునీంద్రుఁడగు శుకుని గూర్చి; పూవుంబోండ్లా
తనిఁగని బిత్తల లయ్యును
వెను కాడరు; లోకదృష్టి వివహితుఁడనుచున్. ౨౩౪

చ. జనకుని కైవివాహ మొల
జవ్వనమందె పరిత్యజించి వా
ఙ్మనసములం, గ్రియన్, మగువ
మాట స్పృశింపక సిరమూలి శాం
తనవుఁడు బ్రహ్మచర్యమును
నైష్ఠికుఁడై నడపెన్ శతాబ్దముల్
జనములు చేతులెత్తి స్తుతి
సల్పిరి ధార్మిక చక్రవర్తిగాన్. ౨౩౫

కం. గురుదేవుఁడు దన తల్లిగ
స్మరించి బ్రాహ్మణినిఁ బూజ సలిపెను; గలరే
ధర నసిధారావ్రతములు
చరించియున్నట్టి బ్రహ్మచారు లనేకుల్. ౨౩౬

కం. ప్రకృతి విరుద్ధంబనికద
ప్రకటింతురు మీకు సాధ్యపడనట్టి క్రియన్;
ప్రకృతిసహజంబునుఁడీ ! యా
గికసిద్ధులఁ బుడికికొన్న కృతులకు మీకున్. ౨౩౭

గీ. బ్రహ్మచర్యవ్రతం బధర్మముగ మదినిఁ
గొనఁ దలంతేనిగో ! వట్టి గొడ్లు మీరు !
ధర్మజనుపాంధులరు; 'పవిత్రత'యనుటన్న
నర్థమెఱుఁగని మూర్ఖుల రవనిమీరె." ౨౩౮

కం. అని కొందమసింగమన స
య్యనఘుఁడు గర్జింప గుండెలదరఁగ, నొకఁడుం
గనరాఁడయ్యెను శ్రీ స్వా
మి నెదుర్కొనువాఁడు; సిగ్గమించిరి మెల్లన్. ౨౩౯

కం. నెఱఁజన 'శాన్ఫ్రాన్సిస్కో'
పుర 'కనకద్వారభవనమున' నాతండు
త్తఱి "విశ్వమతాదర్శము"
గుఱించి భాషించి మేలుకొలిపెను జనులన్. ౨౪౦

చ. తనియక వారు స్వామి పద
తామరసంబులఁ గొల్చి పాఠముల్
దినదిన మభ్యసించుచుఁ బ
దింబడి సూక్తులు వించు, యోగ సా
ధనము లొనర్చుకొంచుఁ దము
ధన్యులుగా నెద నెంచుకొంచు, జీ
వన మొనరించుచుండ్రి, భవ
బంధము లూడ్చుతలంపు పెంపునన్.

కం. ఒకతూరి 'జ్ఞానయోగం';
బొకపర్యాయంబు "రాజయోగంబును"; వే
ఱొకతడవఁ "గర్మయోగం"
బొకపరి యతి కఱచె భక్తియోగంబు నిటుల్. ౨౪౧

## ౨౬. రఘునాథదాసచరిత్ర

చ. మును 'రఘునాథదా'సను ప్ర
భుత్వమునారి సిపాయి యొక్క తా
వున 'మహారాజవా' నయి ప్ర
బుద్ధత నుండఁగ నాఁటిరేయి నా
తనికడనుండి భక్తజన
తండము పెద్దగ రామనామ కీ
ర్తన మొనరించుకొంచునుగఁ
దత్క్షణమందు నొంటిల్ గనుచ్చఁగాఁ.

ఆ.వె. తీసిపాఱవైచి వేసంబుఁ, గాసంబు,
సరగ దూఁకి భజనసంఘమందుఁ
గలిసిపోయెఁ గానఁగారాక; మినుముల
రాసియందు నల్లపూసవోలె. ౨౪౪

కం. అతఁడొనరించిన నియోగ
వ్యతిక్రమంబునకుఁ గినిసి వాసిని సేనా
పతి "ఓయి! యెఱుఁగవే? త్వ
త్కృతాపరాధార్హ దండ మిటు గాల్చుటయే." ౨౪౫

కం. అని గుఱిపెట్టి తుపాకిని
క్షణమారక యుండి మనను గరఁగఁగ" ఓయీ!
నిను మెచ్చితి నీతడనకుఁ;
జను; మిఁక ముందెన్నఁడిట్లు చరియింపక నే. ౨౪౬

కం. మఱునాఁటి రేయి నాతఁడు
మఱచి గతకథానకం బసాంతముగ నొడల్
పెరుగంగ భజనసంఘపు
వఱదం బడిపోయె నా ప్రభాతం బెటకో! ౨౮౭

ఆ. వె. దండనాయకుండు దయచేసి "రఘునాథ
దాసు" బ్రహ్మరితిరుగు తావునందె
కాంచి తాఁ బరామృశించె ముమ్మాఱులు;
బదులువల్కె "దాసు" ప్రశ్నములకు. ౨౮౮

క. దాసు మర్నాఁటి ప్రొద్దుట దండనాథుఁ
దఱసి వచియించి తన నాఁటితప్పిదమును
దన్ను దండింపుమనుచుఁ బ్రార్థన మొనర్చె;
నక్కజంపడె దళవాయి యెఱసి కథకు. ౨౮౯

ఆ. వె. నమ్మఁడయ్యె దండనాథుండు దదపరా
ధంబు; దోషినంచు దాసు వలికెఁ;
బ్రహ్మరిఁ జుట్టినట్టివాఁడు 'రాముఁడె' యంచు
నిరువురెడఁద నిశ్చయించుకొనిరి. ౨౯౦

ఆ. వె. దండనాయకుండు దాసుని ధన్యుఁగాఁ
దలఁచి కౌఁగిలించె; దాసు మ్రొక్కె
రామదర్శనమున రారాజమానుఁడై
యున్నవానిఁ బెద్ద సన్నుతించె. ౨౯౧

ఆ. వె. ప్రభువు కొలువు సేసి భక్తవరేణ్యుండు
దాసుఁ గోరునపుడు దండనాథు,
దాస్యబంధముక్తిఁ దత్క్షణంబందె సం
సారబంధముక్తి సాధనముగ. ౭౫౨

కం. ఈదృశభగవద్భక్తులు
మా దేశమునందుఁ గోట్లమంది గలరు; ప్ర
హ్లాదుండు గృహస్తంభము
లో దేవునిఁ జూపెఁ జూడి! ఖలుండగు పితకు౯. ౭౫౩

కం. పరికించితి యతి, యాతఁడు
"సరస్వతీ" తీరమున వసతిఁగొని యున్నా
తురులకు స్థాపించిన స
త్త్రమును; స్మరియించి యతని ధన్యుఁడ నైతి౯." ౭౫౪

గీ. దినదినమొనర్చుచు మహోపదేశముట్లు
లమెరికా దేశ సంచార మాచరించి
"మతచరిత్రసభా" హ్వాన మతఁడు పొంది
'ప్యారి' పత్తనమునకుఁ బ్రయాణమయ్యె. ౭౫౫

గీ. భరతభూమినిఁ బ్రభవించి ప్రబలియున్న
"సర్వమతదర్శనచరిత్రి" స్వామి యచటి
బుధుల ఖండనమండన పూర్వకముగ
నచ్చెరువుగొల్పు చిఁడె నుపన్యాసములను. ౭౫౬

ఆ. వె. " ప్యారి " నుండిచని" " వియన్నా"కు, " కాన్స్టాంటి
నోపిలు " నకు " ఏథెన్సున " కేగి
పుటున " కందు ధర్మబోధామృతమును వ
ర్షించి చవుడుఁబండఁ జేసె లెస్స. ౨౫౭

## ౩౭. భరతదేశాగమనము — మఠాగమనము

అ. వె. అచటినుండి స్వామి యాత్మదర్శనలాల
సముల దేశములను సరవిఁగనుచు
స్వాగతార్చనంబు లందుచుఁ బయనించె
దివ్యభూమి భరతదేశమునకు. ౨౫౮

కం. మఠమునకు స్వామి యేగెను
హఠాత్తుగా నొక్కరేయి; నవు డానందో
ల్లసితాత్ములగుచు శిష్యుల
ముఠా తదభ్యర్చసేసి ముదముం బొందెన్. ౨౫౯

ఆ. వె. స్వామి నాఁటనోల సహాయించి మఠభార
మును యథాపురంబు మూసికొనును
దినకతిపయమున నె తనజీవితాబ్జముం
జెద నెఱింగె దివ్యదృష్టి కతన. ౨౬౦

కం. అవశిష్టంబు, విశిష్టము,
నవుకర్తవ్యంబుఁ దీర్ప యతివర్యుఁ డహ
ర్దివ మంతేవాసులకుం
బ్రవచించుచు నుండె ధర్మపాఠావళినిన్. ౨౬౧

సీ. బ్రహ్మభూయావలంబన మైన పావన
   బ్రహ్మచర్యం బొక్కపరి వచించుఁ;
ప్రాచ్యప్రతీచ్య తత్త్వజ్ఞానముల భేద
   సామరస్యము లొక్కసారిఁ బలుకు;
నస్పృశ్యతాది దురాచార నిర్మూల
   న ప్రమాణము లొక్కనాఁడు గఱపు;
ధర్మసాధనము గాత్రముగానఁ బుష్టికై
   వ్యాయామకృతి నొక్కసారిఁ దెలుపు;

గీ. దివ్యజీవనమును, మాతృదేశసేవ,
సమరవాఙ్మయ, మార్గవిద్యారహస్య
ముల గుఱించి పెక్కుమారులు బోధసేయు
స్వామి క్రొంగ్రొత్తయిన శిక్షాక్రమమున. ౨౬౨

కం. పునరుక్తులుఁ, జర్వితచ
ర్వణంబులును స్వామిభాషకుఁ జెనుభూ
షణములు; పరభాషకు దూ
షణములు; విచ్ఛిత్తికతన సవిసంద్రుబుధుల్. ౨౬౩

గీ. చండశాసనుఁడాతఁడు ఛాత్రగణము
తనదు గీచిన గీఁతను దాటిరేని
మఠమునం దిండిపెట్టక "మాధుకరము
నెత్తికొండని." పంపు రేకేత్తఁగింక. ౨౬౪

గీ. కఠినములయందు నాస్వామి కఠినతరుఁడు
మృదువులందు విచారింప మృదుతరుండు
చండభానుండ యయ్యు సూర్యుండు లోక
బాంధవుండన్న బిరుదును బడయలేదె? ౭౬౫

౫౫. స్వామియనారోగ్యము

కం. మొదలిడెను గుంటినడకలు
తదీయ మారోగ్య; మెపుఁడ దానిఁ గొనక తా
నెదురీఁదఁ దొడఁగినట్టులు
స్వదైనిక క్రియలు విడకసాఁగించు కొనెన్. ౭౬౬

గీ. మల్లమార్తాండుఁడైన యామన్కరిఁగని
వ్యాధి భయమొంది దొలఁకుఁ బాఱుచుండు;
మరల నెదిరించు; వెనుకకుఁ బఱచు మరల;
వార లొండొరులకుఁ దీసిపోరు బలిమి. ౭౬౭

కం. భువనేశ్వరమ్మ యొకనాఁ
డు వివేకానందునకు నిటుల్ కబురంపెం
పె; "విచారించుచునుంటిని
భవదస్వాస్థ్యంబుఁగూర్చి పవలును రేయున్. ౭౬౮

ఆ. వె. నీదుచిన్న నాఁట నే నమ్మవారికిఁ
బొఁగలు దండములను మ్రొక్కుకొంటి
సేమమయ్యె నీకుఁ; జెల్లింపుమీ! మ్రొక్కు
నేఁడు నీవు; మరల నెగడు మేలు. ౭౬౯

మ. తనమాత్రాజ్ఞను స్నానపూజాది దివిష
ద్గంగా ప్రవాహంబునన్
జని చెల్లించెను బ్రాహ్మదండములు; పూ
జల్ సేసెఁ; గాళ్యాలయం
బును జుట్టెం దగ సప్తవారములు; నై
వేద్యోద్వల్ ఘటించెం; బొన
ర్చెను హోమంబు; లశక్తుఁడయ్యు నెఱవే
ర్చెన్ స్వామి సర్వక్రియల్. 220

కం. తనమాతృ ననారోగ్యముఁ
గని యాతఁడు దివ్యదృష్టిఁ గనుఁగొను బత్తిం
జని దర్శనమొసరించె; స్వ
జననియుఁ గాళజననియు సమలాతనికిన్. 221

గీ. అయ్యెఁబై చెయ్యి వ్యాధిది యంతకంత;
కతఁడు నానాఁడు దీసికట్టగుచునుండెఁ;
దనదు కర్తవ్యములఁ దీర్చవెనుదివియక
కొలఁదులందాఁటి నిచ్చవర్తిలుచునుండె. 222

కం. ఒకనాఁడు స్వామి దలఁచెను
"స్వకియ కర్తవ్యమెల్ల సాధించితి; మా
మక దేశికసందేశముఁ
బ్రకటించితి; నేనదృష్టనంతుఁ"డ నంచున్. 223

ఆ. వె. స్వరము సన్నగిల్లి పలుకఁ జాలకయును
ప్రవచనం బొనర్పఁ బట్టుదలను;
ఉపవిశింపలేకయును జేయుఁబెద్దయు
సేవ ధ్యాన మతఁడు రేవుమావు. ౨౭౪ ·

గీ. ఆతఁ డొకనాఁడు చూచి పంచాంగకంబు
నొక్కతిథి గుర్తుపెట్టె; మఱొక్కనాఁడు
దిరుగుచు స్వశిష్యులతో గాంగతీరమందుఁ
దన్ను దహియింపు డిట నంచు స్థలముసూపె. ౨౭౫

మ. తరులంబువ్వులువాడె; నాశ్రమశకుం
తస్వాద్యకంఠం బప
స్వరగీతంబుల నాలపించె; మొదవుల్
పాల్చేఁప కుద్విగ్నతం
జరియింపంగఁ దొడంగె నేఁతవిడి; త
చ్ఛాత్రుల్ ప్రయత్నించియున్
జొరరై రాత్మసమాధి నొక్కదినమం
దు స్వామి కానున్నదో ? ౨౭౬

మ. చమురున్ వత్తియులేక యీభరతదే
శం బొక్కటే కాక ఖం
డము లైదింటిని వెల్గఁజేసిన యఖం
డ జ్యోతి నాఁడారె; లో

కము తెల్లంబడి చిమ్మచీఁకటుల బ్రుం
గంజొచ్చె; నీమర్త్య లో
కము పాతాళములోకిఁ గూలిన యటుల్
కంపించి ర ప్పెల్లరున్. ౨౨౭

గీ. అవని నీశ్వరాంశమైనట్టి స్వామి
మేనినుండి మహాజ్యోతి మింటికెగసి
దివ్యమసి ప్రాఁకి కాశీపురీస్థమైన
లింగమును జొచ్చి యందు విలీనమయ్యె. ౨౨౮

గీ. తన సహస్రకరంబులఁ బెనఁగుచున్న
స్వామిసూక్ష్మశరీరంబు భానుబింబ
మొయ్య భేదించికొని బిలం బుచ్చిపోయి
బ్రహ్మలోకంబునను ముహూర్తమున బ్రాలె. ౨౨౯

ఆ. వె. స్వామిసూపినట్టి స్థలమునఁ దద్భస్మ
రాశియందు నొక్క రమ్యమైన
యాలయంబు వెలిసె; నా వివేకానందుఁ
డటఁ బ్రతిష్ఠఁగాంచె నద్భుతముగ. ౨౩౦

# సాధుపత్త్రము

| పుట | అసాధువు | సాధువు |
|---|---|---|
| 1. | కృష్ణంభొట్లు | కృష్ణంభొట్లు |
| 2. | డెరఁగు | డెరగు |
| 3. | మున్నూఁటు | మున్నూటు |
| 4. | తృటి | త్రుటి |
| 5. | నంరేద్రు | నరేంద్రు |
| 7. | ధాన్యంబునన్ | ధ్యానంబునన్ |
| 8. | శ్రీ | శ్రీ శ్రీ |
| 20. | నతడుఁ | నతఁడు |
| 22. | కుటిచకుం | కుటీచకుం |
| 28. | సమాధినిష | సమాధినిష్ఠ |
| 32. | ఇదమిత్థంబని | ఇదమిత్థమ్మని |
| 33. | తృటి | త్రుటి |
| 34. | జనతప్రశ్శ్రీల | జనతపశ్శ్రీల |
| 36. | జగద్గురుతనొదునటందురు | జగద్గురుతఁగారిలుదునందురు |
| 40 | వ్యథన్ | వ్యథన్ |
| 41. | బలిష్ఠమై | వరిష్ఠమై |
| 53. | అఱ | రఅ |
| 58. | గనుఁగొని | గొనకొని |
| ,, | గురుఁడభ్యర్చించితే | గురుఁడభ్యర్థించితే |
| 59. | దవస్థ | దదవస్థ |
| 60. | చయమొ | చయము |
| 61. | మానసంరక్ష | మానసంరక్ష |
| 69. | రామకృష్ణుఁడు | రామకృష్ణుండుఁ |
| 78. | చెవులూఱు | చెవులూరు |
| 85. | స్వీకరించు | స్వీకరించు |
| 87. | గూర్చిండి | గూర్చుండి |
| 95. | వచిచిన | వచించిన |
| 97. | దాటి | దాఁటి |

| పుట | అసాధువు | సాధువు |
|---|---|---|
| 97. | జాతిక | జాతకీ |
| 98. | హైందవు నెల్ల | హైందవుల నెల్ల |
| 100. | ప్రపర్తన | ప్రవర్తన |
| 100. | తలపుము | తలంపుము |
| 101. | స్వమహిమత | స్వమహిమ్నత |
| 108. | నాసిను | నాసీను |
| 110. | నదసియ | నదసీయ |
| 111. | భగత్సాయుజ్యము | భగవత్సాయుజ్యము |
| 112. | సేవగించినారు | సేవ మొందినారు |
| 113. | తరుర్ఛాయ | తరుచ్ఛాయ |
| 115. | పాండి | పాడి |
| 122. | యీా సిమ | యీా సీమ |
| 124. | దుదుర్జనత | దుర్జనత |
| 131. | చదంమున | చందమున |
| 143. | సాంగుచు | సాగుచు |
| 162. | రామకృష | రామకృష్ణ |
| 173. | పదంపడి | పదపడి |
| 174. | మవి | మతి |
| 175. | యవరింత్రు | యవతరింత్రు |
| 186. | కాళిజనని | కాళీజనని |
| ,, | స్వకయ | స్వకీయ |

*Presented In Memory Of*
*Late Vangapalli Nalakantam.*

# ఈ గ్రంథకర్త ఇతర గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| ౧. తత్సమచంద్రిక | ౫ | ౦ | ౦ |
| ౨. కావ్యాలంకారసంగ్రహము (సవివరణము) | ౮ | ౦ | ౦ |
| ౩. జాతకకథాగుచ్ఛము (ప్రథమభాగము)<br>(ఆంధ్ర, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయములచే పాఠ్యముగా నిర్ణీతమైనది) | ౧ | ౮ | ౦ |
| ౪. జాతకకథాగుచ్ఛము (ద్వితీయభాగము)<br>(మద్రాసు విశ్వవిద్యాలయ విద్వాన్ B కి పాఠ్యము) | ౧ | ౮ | ౦ |
| ౫. కీరసందేశము—ద్వంద్వయుద్ధము<br>(మద్రాసు విశ్వవిద్యాలయముచే పాఠ్యముగానిర్ణీతము) | ౧ | ౪ | ౦ |
| ౬. గోవర్ధనాచార్య సప్తశతీసారము (శృంగారము) | ౧ | ౦ | ౦ |
| ౭. పువ్వులతోఁట (ఖండకావ్యములు) | ౦ | ౮ | ౦ |
| ౮. కావ్యమంజరి ,, | ౦ | ౮ | ౦ |
| ౯. నడుమంత్రపు సిరి (అధిక్షేపకావ్యము) | ౦ | ౮ | ౦ |
| ౧౦. ఖడ్గతిక్కన | ౦ | ౧౨ | ౦ |
| ౧౧. అమృతకణములు (శృంగారము) | ౦ | ౮ | ౦ |
| ౧౨. వాసవదత్త | ౧ | ౦ | ౦ |
| ౧౩. రేణుక విజయము | ౧ | ౦ | ౦ |
| ౧౪. ఆంధ్రప్రబంధకథలు (గద్యము) | ౧ | ౮ | ౦ |
| ౧౫. వివేకానందము (పద్యకావ్యము) | ౨ | ౦ | ౦ |
| ౧౬. ఆంధ్రకళావిలాసము (గద్యము) | ౧ | ౦ | ౦ |

# అముద్రితములు

౧. డిత్థడబిత్థోపాఖ్యానము (అధిక్షేపకావ్యము)

౨. వ్యాకరణకోశము

౩. పండ్లగంప (శృంగారపంచశతి)

౪. జాతకకథాగుచ్ఛము (తృతీయభాగము)

ప్రాప్తిస్థానము:—

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

౪౪ జీరా,

సికింద్రాబాద్ (దక్కను)